# ప్రజాపక్ష సమీక్ష

మే 01-15, 2003 | సమతా పబ్లికేషన్స్ ప్రచురణ | వెల రు. 5-00




### లోపలి పేజీల్లో...




వార్షిక చందా రూ॥ 120/- లు

Edited, Printed and published by
V.Hanumantha Rao
for Samata Publications
D.No. 8-3-898/22, Road No.3,
Nagarjuna Nagar,
Hyderabad- 500 073.
Phone: 23748672

DTP: V.S.Graphics,
Erragadda. Ph:23837843.

Printed at: Charita Graphics
Chikkadpally, Hyderabad - 062.


సంపాదకీయం:

## రాజకీయాలను 'రాజకీయాలుగా' చెప్పుకోవడానికి సిగ్గెందుకు?

**ఎన్నికలు దగ్గిరపడుతున్న** కొద్ది రాజకీయ పార్టీలన్నీ ఒకరిపై ఒకరు చేసుకుంటున్న విమర్శల్లో రెండు మాటలు తరచుగా వినబడుతున్నాయి. అందులో ఒకటి 'ఆచరణ సాధ్యం కాని హామీలిస్తున్నార'ని, ఒకరిపై ఒకరు చేస్తున్న ఆరోపణ. రెండోది 'రాజకీయ ప్రయోజనాన్ని ఆశించే ఫలానా కార్యక్రమాన్ని ఫలానా పార్టీ నిర్వహిస్తున్న'దనే ఆరోపణ. కాంగ్రెసు పార్టీ గత నెల రోజులుగా చేస్తున్న 'ప్రజాప్రస్థానం' పై తెలుగుదేశం చేస్తున్న విమర్శల్లో ఈ రెండు ధోరణులు కలిసే ఉన్నాయి.

రాష్ట్రంలో నెలకొన్న తీవ్ర కరువును రాజకీయ లబ్ధికోసం పాదయాత్ర ద్వారా రాజకీయం చేస్తూ ఆచరణ సాధ్యం కాని హామీలిస్తున్నారనే దేశం పార్టీ విమర్శపై 'లేదు, లేదు కరువును రాజకీయం చేయాల్సిన అవసరం తమకు లేనే లేదని' కాంగ్రెస్ పార్టీ తడబాటు ప్రతిస్పందన చూస్తుంటే చాలా తమాషాగా ఉంది. ముఖ్యమంత్రి సైతం ఇదే అర్థంలో 'ఒక్క ఎన్నికల సమయంలో తప్ప మిగతా సమయాల్లో అభివృద్ధి చింతేకాని రాజకీయాలు చేయన'ని పదే పదే చెప్పుకుంటున్నారు. ఈ ధోరణి ప్రకారం 'తమవి తప్ప ఇతరుల రాజకీయాలంటేనే దురుద్దేశం కలగలసిన కార్యక్రమాలనే' ప్రచారాన్ని పనిగట్టుకొని చేస్తున్నట్లు కనబడుతుంది. ఒకరి దృష్టినుండి చూస్తే మరొకరి కార్యక్రమంలో దురుద్దేశం కనబడడం సహజమే. అధికారంలో ఉన్న వాళ్లకి అధికారం లాక్కునే వాళ్ల కార్యక్రమాల్లో దురుద్దేశం కనిపిస్తే, అధికారం లాక్కోవాలనుకునే వాళ్లకు అధికారంలో ఉన్నవాళ్ల కార్యక్రమంలో దురుద్దేశం కనబడుతుంది. ఇది అన్ని పార్టీల సహజ లక్షణమైనా అధికార పార్టీకి మరీ సహజం. ఎందుకంటే అప్పటిదాక అధికారం చలాయించిన దానికి అధికారం వదులుకోవడం ఇష్టం ఉండదు కదా! అందుకే తరచూ ఇలాంటి ఆరోపణలు. ఈ ఆరోపణల వెనుక ఉన్న అసలు కారణం, ఎదుటివాళ్లు ప్రజలకెక్కడ దగ్గరవుతారోనన్న భయం తప్ప ఇంకొకటి కాదు.

అసలు అధికారంలో కొనసాగుతున్న గ్రూపైనా, లేక ప్రతిపక్షంలో కొనసాగుతున్న గ్రూపైనా తాము నిర్వహిస్తున్న కార్యక్రమాలన్ని మొదట అధికారం నిలుపుకునే, లేదా లాక్కునే స్వభావానికి చెందినవే అవుతాయి. ఆ తర్వాతే అవి అభివృద్ధి ప్రజోపయోగ కార్యక్రమాలుగానో, లేదా అభివృద్ధి నిరోధక, ప్రజా వ్యతిరేక కార్యక్రమాలుగానో తేలుతుంటాయి. మరి ఈ వాస్తవాన్ని ఒప్పుకోవడానికి రాజకీయ పార్టీలకెందుకింత సిగ్గు? అసలు రాజకీయ పార్టీలు 'చేస్తున్న కార్యక్రమాల్లో కొంత సమయంలోని కొంత భాగాన్ని రాజకీయమని, తక్కిన సమయంలో తక్కిన భాగాన్ని రాజకీయ రహిత అభివృద్ధి కార్యక్రమమనే విధంగా ప్రజలెవరూ ఆ కార్యక్రమాలను వేరు వేరుగా అర్థం చేసుకోవడం లేదు. తాము చేస్తున్న ఏ కార్యక్రమం అయినా రాజకీయమేన'ని, ఏ పార్టీ ప్రకటించినా ప్రజలకేమీ అభ్యంతరం లేదు. ఎటొచ్చి ఆ కార్యక్రమాల పట్ల ప్రజలకున్న ఆసక్తి, అభ్యంతరాలు దేనిమీద నంటే వాటిల్లో విశాల ప్రజల ప్రయోజనాలకు సంబంధించిన నిజాయితీ ఏమైనా ఉందా? లేదా? అన్నదానిపైనే. ఈ అంశాన్ని అన్ని పార్టీలు గుర్తిస్తే మంచిది.

## రెండురెళ్ళ నాలుగు

### రాష్ట్రంలో పంటల్లో వచ్చిన మార్పులు(స్థూల పంట భూమిలో శాతం)

| పంటలు | మూడు సంవత్సరాల సగటు | | | | |
|---|---|---|---|---|---|
| | 1958-59 | 1968-69 | 1978-79 | 1988-89 | 1998-99 |
| బియ్యం | 24.0 | 25.2 | 29.9 | 30.4 | 30.5 |
| జొన్న | 21.2 | 20.5 | 17.9 | 13.1 | 6.1 |
| సజ్జలు | 5.1 | 4.8 | 4.5 | 2.6 | 0.9 |
| మొక్కజొన్న | 1.6 | 1.8 | 2.4 | 2.5 | 3.0 |
| రాగులు | 2.6 | 2.6 | 2.6 | 1.5 | 0.8 |
| కాయధాన్యాలు5 | 4.5 | 55.0 | 57.3 | 50.2 | 41.2 |
| కందులు | 1.3 | 1.4 | 1.6 | 2.6 | 2.7 |
| మినుములు | 1.1 | 1.5 | 1.5 | 3.3 | 3.7 |
| శెనగలు | 0.9 | 0.6 | 0.5 | 0.4 | 1.0 |
| పెసలు | 3.1 | 3.7 | 4.0 | 14.1 | 3.6 |
| ఉలవలు | 3.8 | 3.2 | 2.7 | 1.5 | 0.9 |
| పప్పుధాన్యాలు | 10.1 | 10.5 | 10.3 | 12.0 | 12.0 |
| వేరుశెనగ | 9.8 | 10.0 | 9.1 | 16.2 | 15.3 |
| నువ్వులు | 2.1 | 1.9 | 1.2 | 1.4 | 1.3 |
| ఆముదాలు | 2.4 | 2.2 | 2.1 | 2.6 | 1.6 |
| సన్‌ఫ్లవర్ | - | - | - | 0.7 | 2.6 |
| నూనెగింజలు | 14.2 | 14.1 | 12.4 | 20.8 | 20.7 |
| చెరకు | 0.6 | 1.0 | 1.2 | 1.2 | 1.6 |
| పత్తి | 2.9 | 2.5 | 2.9 | 4.5 | 8.2 |
| పొగాకు | 1.3 | 1.7 | 1.8 | 1.1 | 1.4 |
| మిరప | 1.1 | 1.5 | 1.1 | 1.6 | 1.7 |
| ఉల్లి | 0.2 | 0.1 | 0.1 | 0.2 | 0.2 |
| ఇతర పంటలు | 6.0 | 6.7 | 7.2 | 8.6 | 13.1 |
| అన్ని పంటలు | 84.9 | 86.2 | 87.1 | 91.5 | 87.0 |
| స్థూల పంటభూమి (హె) | 121.8 | 126.4 | 125.1 | 119.2 | 130.6 |

### ఎంపికచేసిన పంటల భూవిస్తీర్ణం, ఉత్పాదకత, పెరుగుదల

| పంటలు | 1957-58 నుండి 1969-70 | | 1970-71 నుండి 1979-80 | | 1980-81 నుండి 1989-90 | | 1990-91 నుండి 1998-99 | |
|---|---|---|---|---|---|---|---|---|
| | విస్తీర్ణం | దిగుబడి | విస్తీర్ణం | దిగుబడి | విస్తీర్ణం | దిగుబడి | విస్తీర్ణం | దిగుబడి |
| బియ్యం | 0.81 | 0.80 | 1.04 | 2.50 | 2.27 | 3.05 | 0.27 | 1.30 |
| జొన్న | 0.06 | -1.77 | -0.64 | 2.45 | -1.69 | 1.36 | -4.28 | 1.49 |
| సజ్జలు | -0.97 | -1.25 | 0.21 | 2.42 | -5.99 | 0.33 | -11.31 | 3.86 |
| మొక్కజొన్న | 1.95 | 4.68 | 3.48 | 3.65 | -0.77 | 1.12 | 1.71 | 6.29 |
| రాగులు | -0.72 | -1.10 | -0.52 | 3.19 | -5.64 | -0.69 | -5.32 | 1.86 |
| కందులు | 1.73 | 3.51 | 0.68 | -8.60 | 4.56 | 3.51 | 0.86 | 3.2 |
| మినుములు | 4.43 | 0.28 | -1.17 | 5.19 | 7.89 | 5.75 | 3.68 | -3.60 |
| పెసలు | 2.23 | -1.48 | 1.02 | 7.09 | 0.09 | 1.73 | -0.91 | 0.47 |
| శెనగలు | -3.50 | -0.73 | -1.49 | 2.26 | -3.09 | 2.72 | 11.07 | 6.18 |
| ఉలవలు | -1.22 | -0.50 | -0.74 | 3.97 | -7.50 | 1.07 | -5.0 | 3.03 |
| వేరుశెనగలు | 3.08 | -2.11 | -0.30 | 1.89 | 4.88 | 0.36 | 1.19 | 0.71 |
| పత్తి | -0.89 | -0.35 | 1.33 | 10.57 | 4.58 | 3.43 | 6.04 | 1.39 |
| మిరప | 4.22 | -1.70 | -2.07 | 3.24 | 2.96 | 5.99 | 1.08 | 2.21 |
| చెరకు | 5.89 | -0.56 | 0.42 | -0.03 | 0.82 | -1.77 | 3.24 | 1.04 |
| నువ్వులు | 0.58 | 0.10 | -3.95 | -1.07 | -0.47 | -0.73 | 1.29 | 3.66 |
| పొగాకు | 4.16 | -1.28 | -0.89 | 2.3.6 | -3.31 | 2.16 | 1.10 | 1.21 |
| ఆముదం | 0.58 | 2.77 | -1.40 | 1.79 | 1.89 | 2.23 | -3.31 | 3.16 |
| ఉల్లి | -0.32 | -3.52 | -1.11 | -1.38 | 3.11 | 4.38 | 2.54 | 5.36 |

# ఉపరితల జలాల సమాధిపై సూక్ష్మజల సాగా!?

- ఇ.పి.ఎస్.పి.దర్శిని

**రాజకీయ ప్రచార** లబ్ధిని లక్ష్యంగా పెట్టుకుని రెండేళ్ల క్రితం ప్రారంభించి, మొన్నటివరకు కొనసాగించిన జలసంరక్షణ, నీరు, మీరు, పథకాలకు అక్షరాలస రు. 1650 కోట్లను అధికార పార్టీ కంట్రాక్టర్లకు హారతి కర్పూరంలా అర్పించుకున్న ప్రభుత్వం, తాజాగా ఈవేసవిలో మరో రు. 1200 కోట్లను సాగునీటి పరికరాల వ్యాపారులకు, ధనిక రైతులకు ఫలహారంలా పంచిపెట్టే 'సూక్ష్మ నీటి పారుదల' పథకాన్ని ప్రారంభించింది.

పథకం విజయవంతానికి ప్రధాన కారకాంశంగా ఉండబోతున్న భూగర్భ జల లభ్యత సాధ్యాసాధ్యాల విషయం కాసేపు పక్కన బెట్టినా, ఈ పథకం ప్రధానంగా ధనిక రైతులకు ప్రయోజనం చేకూరబోతున్న విషయాన్ని మొదట విశ్లేషిస్తే...

1995-96 వ్యవసాయ లెక్కల ప్రకారం మొత్తం రాష్ట్ర కమతాల్లో 35.4 శాతంగా ఉన్న 0.5 హెక్టార్ లోపు వ్యవసాయ భూమిని కలిగిన నిరుపేద రైతుల చేతుల్లో సాగవుతున్న భూమి, మొత్తం రాష్ట్ర సాగులో 7.6 శాతం మాత్రమే. అలాగే మొత్తం కమతాల్లో 23.0 శాతం ఉండి, 0.5 హెక్టార్ నుండి 1.0 హెక్టార్ వరకు వ్యవసాయ భూమిని కలిగిన పేద రైతాంగం చేతుల్లో సాగవుతున్న భూమి, మొత్తం రాష్ట్ర సాగులో 12.5 శాతం మాత్రమే. అంటే రాష్ట్రం మొత్తం సాగులో ఈ రెండు స్థాయిల్లోని పేద, నిరుపేద రైతాంగం కలిపి రాష్ట్ర మొత్తం కమతాల్లో 59.4 శాతం, విస్తీర్ణంలో 22.5 శాతం అన్నమాట. రాష్ట్ర వ్యవసాయ రంగాన్ని, ముఖ్యంగా తెలంగాణ, రాయలసీమ, వ్యవసాయ రంగాన్ని పరిశీలించ దలచిన వారెవరికైనా, ఈ స్థాయి వర్గీకరణ పరిధిలోకి వచ్చే రైతులంతా దళితులేనన్న విషయం స్పష్టంగానే తెలుస్తుంది. గ్రామానికి దూరంగా నిస్సారంగా ఉండి, వ్యవసాయ సాగు అనుకూలతను కలిగి ఉండని, కేవలం వర్షాధార పంటలనే సాగుచేస్తున్న ఈ దళిత రైతాంగం, గ్రామంలోని ధనిక, మధ్యస్థ రైతు వర్గాలకు పాలేర్లుగా కొనసాగడమే పోషణకు ప్రధానాధారంగా ఎంచుకున్నారు. ఇందులో 95 సాతం మందికి పైగా వ్యవసాయ పశువులుగాని, వ్యవసాయ పరికరాలు గాని లేనే లేవు. నూటికి నూరు శాతం ఈ వర్గం రైతులంతా ఈ సరికెప్పుడో ప్రైవేటు వడ్డీ వ్యాపారులవద్దో, లేదా పలు గ్రామీణ వాణిజ్య, సహకార బ్యాంకుల్లోనో, అప్పు నమోదు దారులుగా కొనసాగుతున్నారు. ఈనేపథ్యం నుండి ఆలోచిస్తే 'సూక్ష్మనీటిపారుదల' పథకంలో, లబ్ధిదారులవ్వడం ఈ వర్గాలకెలా సాధ్యం? ప్రభుత్వం ఇచ్చే 50 శాతం సబ్సిడి ద్వారా ఈ పథకం లబ్ధిదారులవ్వాలంటే తాము స్వంతంగా సమకూర్చుకోవల్సిన మిగతా 50 శాతం డబ్బును ఎక్కడి నుండి తేగలరనే ప్రశ్నే ఈ సందేహానికి కారణమౌతుంది. పైగా ఈ వర్గం రైతులందరికీ దాదాపుగా ఇప్పటి వరకు వ్యవసాయ బావి, లేదా బోరుగానీ లేనే లేవు. ప్రస్తుత పథకం ద్వారా లబ్ధి పొందగోరి, బోరు వేయగలిగే స్థోమత గల రైతు ఉన్నా, హెక్టారు లోపు గల అతి చిన్న కమతాల్లో కొత్తగా బోరువేయదలిస్తే, భూగర్భజల లభ్యత పరీక్ష, ఒకటికంటే ఎక్కువచోట్ల నిర్వహించ వీలేలేదు. ఆ ఒక్క చోటనే నిర్వహించిన పరీక్షలో భూగర్భ జలం లేదని గనుక తేలితే ఇక ఆ రైతు ఈ పథక లబ్ధిదారుల జాబితాలో నుండి శాశ్వతంగా వైదొలగినట్లే. మొత్తంగా తేలేదేమంటే హెక్టారు లోపు కమతాలు కలగిన చిన్న సన్నకారు, పేద నిరుపేద దళిత రైతాంగానికి ఈ పథకం ద్వారా ప్రయోజనం ప్రాప్తిలేనట్లే. పోతే మొత్తం రాష్ట్ర సాగులో 42.6 శాతం సాగవుతూ, 2 హెక్టార్ల కమతాలు కలిగి వున్న రైతాంగంలో అతి కొద్ది మందికి ఈ పథకం లబ్ధిలో చోటు దక్కినా అది ఆశ్చర్య పడాల్సిన విషయమే. ఇదిలా ఉండగా మొత్తం రాష్ట్ర సాగులో 48.5 శాతం, మొత్తం కమతాల్లో 19,58 లక్షలుగా ఉండి, 2.0 హెక్టార్లపైన 10 హెక్టార్ల మధ్య కమతాలు కలిగిన మధ్య తరగతి రైతులు ఒక మేరకు, రాష్ట్ర సాగులో 8.8 శాతం, మొత్తం కమతాల్లో 0.82 శాతం కలిగి 10 హెక్టార్లపైన సాగుభూమిని కలిగిన ధనిక రైతు వర్గాలు పూర్తిగా ఈ పథకం ద్వారా ప్రయోజనాన్ని పొందబోతున్నారన్నది కాదనలేని నిజం. ప్రధానంగా 10 హెక్టార్లకు పైన సాగుభూమిని కలిగిన వారంతా గ్రామీణ ప్రాంతాల్లో అగ్రవర్ణ రైతాంగమేనన్నది కనిపిస్తున్న పరిస్థితి. ఈ

వర్గరైతాంగం సారవంతమైన భూములు కలిగి ఉండి, ఈ నరికే వారి కమతాల్లో ఒకటి కంటే ఎక్కువగా బావులు, లేదా బోర్లను కలిగి, ట్రాక్టరు తదితర ఆధునాతన వ్యవసాయ పరికరాలతో అధునాతన సాంకేతిక పరిజ్ఞానం ద్వారా పూర్తి స్థాయి వ్యాపార పంటల సేద్యంలో కొనసాగుతున్నారు. పథకం లబ్ధిలో సమకూర్చాల్సిన 50 శాతం నిధులు వారికి లెక్కలోనివి కానేకావు. ఒకవేళ ప్రభుత్వం లబ్ధిదారుల ఎంపికలో సాగుభూమి గరిష్ఠ పరిమితిని ఏ ఐదు ఎకరాలకో పరిమితం చేసినా, ఆ పరిమిత భూమిని కలిగిన రైతులకు అనేక ఆర్థిక, భూ భౌగోళిక అననుకూల పరిస్థితులు ఆటంకం అవుతున్న నేపథ్యాన్ని తమకు అనుకూలంగా మార్చుకొని బినామి పేర్లతో ఈ పథకాన్ని తన్నుకుపోవడానికి పెద్దకమతాల అగ్రవర్ణ రైతులంతా కాచుక్కూచున్నారు.

ఇకపోతే రాష్ట్ర ప్రభుత్వం, డ్రిప్ నీటి పరికరాల ఉత్పత్తి దారులు, వ్యాపారస్తులు కలిసి ఒక్కో ఎకరా యూనిట్ అసలురేటుకు రెండు, మూడు రెట్లుగా ధరపెంచి రైతులకు అంటగట్టి రైతునెత్తిన కుచ్చుటోపీ పెట్టే ప్రయత్నాలు ప్రారంభమైనట్లు వార్తలొస్తున్నాయి. సాధారణంగా మార్కెట్లో ఎకరా డ్రిప్ యూనిట్ సెట్‌కు 15 నుండి 20 వేల ధర ఉండగా ప్రభుత్వం వారి ప్రకటనల్లో అది ఏకంగా 80 వేలుగా పెరిగిపోవడం అంటే అది జరుగుబోయే కుంభకోణాన్నే సూచిస్తుంది. ఈ విషయంలో ప్రభుత్వం తన నిజాయితీని ప్రదర్శించుకోవాలంటే లబ్ధిదారునికి మార్కెట్లో తన ఇష్టం వచ్చిన చోట, తనకిష్టమైన నాణ్యతగల పరికరాలను కొనుగోలు చేయగలిగే స్వేచ్ఛను ఇవ్వాల్సి ఉంది. ప్రభుత్వం నుండి అంతటి చిత్తశుద్ధిని ఆశించటం అంటే అది నిజంగా రైతుల అత్యాశే అవుతుందేమో!

ఇప్పుడొకసారి ఈ పథకం ఆచరణలో ప్రధాన భూమిక కాగలిగిన భూగర్భజల సాధ్యాసాధ్యాలను విశ్లేషిద్దాం. ఈ విషయంలో మొట్టమొదట గుర్తించాల్సిన విషయం భూగర్భజలాల సంరక్షణ, సమృద్ధి, లభ్యత అన్నది భూ ఉపరితల జలాల సంరక్షణ, అభివృద్ధి, పెంపుదలపై ఆదారపడాల్సిన విషయమే గానీ, ఉపరితల జలాల సంరక్షణతో సంబంధం లేని విషయం కానేకాదు. కానీ గత కొన్నేళ్లుగా ప్రభుత్వాలు ఈ విషయంలో తీసుకోవాల్సిన నామ మాత్రపు చర్యలు కూడా చేపట్టక పోవడం అటుంచి ప్రస్తుత తెలుగుదేశం ప్రభుత్వం ఇందుకు పూర్తిగా విరుద్ధమైన దిశలో తలకిందులుగా చర్యలు చేపట్టడం అనాలోచిత చర్య. భూ ఉపరితల, చిన్న, మధ్యస్థ, ప్రాజెక్ట్ నిర్మాణంలో పూర్తిగా విఫలమైన రాష్ట్ర ప్రభుత్వానికి, ఈ విషయంలో ప్రజల్ని ఎప్పటికప్పుడు మభ్యపెట్టే ఈ విధమైన కార్యక్రమాల ద్వారా కావల్సినంత రాజకీయ ప్రచార లబ్ధిని పొందడమే ప్రధానమై పోయింది. ఉపరితల జలాల సద్వినియోగం వల్లనే సాగునీరు, తాగునీరు సమస్య ప్రధానంగా పరిష్కారం కాగలదు గానీ, వాటర్‌షెడ్లూ, ఇంకుడు గుంతలు, చెరువులో పూడిక తీతల ప్రయత్నాలన్నీ కేవలం ప్రచార లబ్ధి ప్రయోజనాల కోసమేనని నీటి పారుదల శాఖలోని అనేక మంది రిటైర్డ్ అధికారులు గొంతు చించుకున్నా ప్రభుత్వం పట్టించుకోవడం లేదు.

ఒకవైపు రాష్ట్రంలోని చెరువులు, కుంటలుగా ఉన్న అనేక వేల చిన్న నీటి పారుదల, మధ్య తరహా నీటి పారుదల వ్యవస్థను ప్రభుత్వాలు పూర్తిగా నిర్లక్ష్య పరచడంతో 1955 నాటికి 10.68 లక్షల హెక్టారుల చెరువుల పారకం 2001-02 నాటికి 5.67 లక్షల హెక్టారులకు పడిపోయింది. మరొకవైపు భూగర్భ జలాల అభివృద్ధి కోసం గత రెండేళ్ల నుండి జల సంరక్షణ పేరుతో, నీరు-మీరు కార్యక్రమం కింద చెరువుల్లో పూడిక తీత, ఇంకుడు గుంటల కార్యక్రమం, వాటర్‌షెడ్ నిర్మాణాల లాంటి దండుగ మారి కార్యక్రమాలన్ని కొనసాగిస్తుంది. 'రోగమొకటైతే మందుకటన్నట్లుంది' ఈ వ్యవహారం. ఇంకుడు గుంటలు, చెరువుల్లో పూడికపై రాష్ట్ర రిటైర్డ్ ఇరిగేషన్ సలహాదారు డి.రామిరెడ్డి 'ప్రస్తుతం ఇళ్లల్లోను, పబ్లిక్ స్థలాల్లోనూ నిర్మిస్తున్న ఇంకుడు గుంటల వల్ల వర్షపునీరు ఇసుక వల్ల క్రిందికి దిగినా, ఆ క్రింద బాగంలో ఉన్న భూమి తీరును బట్టి నీరు లోనికి ఇంకుతుంది కాని, ప్రస్తుతం ఇంకుడు గుంటల్లో వేస్తున్న ఫిల్టర్ మెటీరియల్‌ని బట్టి మాత్రం కాద'ని తేల్చి చెప్పారు. ఇంకా 'ఏదైనా చెరువుల్లో కోటి రూపాయలు ఖర్చు చేసి సిల్టు తీస్తే అక్కడ 50 ఎకరాలకు సరిపడే నీరు మాత్రమే నిల్వ చేయగలుగుతామని, ఆ విధంగా సిల్ట్ తీయడం ద్వారా ఒక టి.ఎమ్.సి. నీటిని నిల్వచేసే ఖర్చు 100 కోట్లవుతుందని, కానీ అదే 100 కోట్లను మధ్యతరహా, భారీ ప్రాజెక్టల మీద ఖర్చుచేస్తే 17 టి.ఎమ్.సి.లకు పైగా నీటిని నిలువ చేసే అవకాశం ఉందని' చెప్పారు. అయినా ప్రభుత్వం తలకెక్కదు. చిన్న, మధ్యస్థ నీటి పారుదల వ్యవస్థలో అనేక ప్రాజెక్టల మత్తళ్లు, చెరువు కట్టలు పూర్తిగా శిథిలావస్థలో ఉన్నందున ఇలాంటి అనవసర నిర్మాణాల ఖర్చులనాపి తక్షణం వాటిని బలపర్చడం చేయాల్సి ఉంది.

ఇక వాటర్‌షెడ్‌ల విషయానికి వస్తే ప్రాజెక్ట్ కమాండ్ రియాలోనే తప్ప వాటర్‌షెడ్ ప్రాజెక్ట్‌లను ఎక్కడపడితే అక్కడ

**(మిగతాది 10వ పేజీలో)**

# సద్దాం హుస్సేన్ - ఒక అంచనా

- వి. శ్రీహరి

**సద్దాం హుస్సేన్** నియంత. మానవ మారణ హోమానికి ఆయుధోత్పత్తికి పూనుకున్న మహా రాక్షసుడు. అతనిని పదవీచ్యుతిడిని చేసే "తెల్లవాని నాగరికతా" బాధ్యతను అమెరికా-ఇంగ్లండ్‌లు సరికొత్తగా నెత్తిన ఎత్తుకున్నాయి.

సద్దాం నియంత. నిజం కావచ్చు. కాదనే ఆధారాలు మనకు లేవు. కాని పేదవాడి దృష్టి నుండి చూస్తే నియంతృత్వం కాని పరిపాలన ప్రపంచం ఇప్పటికి, ఎప్పుడైనా చవిచూచిందా? 1917 రష్యా విప్లవానంతరం ఏర్పడిన నూతన వ్యవస్థ కూడ కార్మిక వర్గ నియంతృత్వమేగదా! అప్పటి వరకు ప్రపంచాన్ని ఏలింది బానిస యజమానుల, భూస్వామ్య శక్తుల నియంతృత్వం. ఆ పాలన రోత బుట్టిస్తుంటే, పారిశ్రామిక సంపన్నులు తమ పాలనకు ప్రజాస్వామ్యమని ముద్దుపేరు పెట్టి తమ దోపిడీని అందుకు సాగించే రాక్షస పాలనకు ముసుగు తగిలించారు. ఐదేండ్లకు ఒకసారి ఏ సంపన్న ముఠా తమను పరిపాలించాలో నిర్ణయించుకునే అవకాశం ప్రజలకు యివ్వడమే ప్రజాస్వామ్యం, సారాంశమని లెనిన్ సూటిగా వర్ణించారు. ఒక్క కార్మిక వర్గమే ధైర్యంగా విప్లవానంతరం ఏర్పడే ప్రభుత్వం కార్మిక వర్గ 'నియంత్రృత్వం' అని నిజాయితీగా ప్రకటించింది. సంపన్నుల నియంతృత్వానికి, సామాన్యుల నిరంకుశత్వానికి నక్కకు, నాగలోకానికి వున్నంత తేడా వుంది. నియంతృత్వం మీద న్యాయమైన ద్వేషం - పెంచుకున్న అనేకమంది మేధావులు ఆ పదం అంటేనే ద్వేషించే స్థితికి చేరారు. విభిన్న నియంతృత్వాల వర్గ సారాంశం మరచారు. ఆ కళ్లద్దాలతోనే "సోవియట్ నియంతృత్వం" అన్నారు. సోవియట్ కుప్పకూలితే నియంతృత్వం కూలిపోయిందని చంకలు గుద్దుకున్నారు. ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ సంస్థ, ప్రపంచ వాణిజ్యం సంస్థల మూర్తిత్రయం గ్లోబలైజేషన్ పేర కొత్త రూపంలో వలన విధానం అవలంభిస్తున్నది. ఇందులో డాలర్ ఆధిపత్యం కీలకం. ఆ ఆధిపత్యం నిలబెట్టుకునేందుకు సైనిక శక్తి సోపానం. ఆ సైనిక శక్తి మహారాక్షసిలా ప్రపంచంలో యిష్టమొచ్చిన చోట అగ్ని వర్షం కురిపిస్తుంటే - "సోవియట్ యూనియన్ వుండి వుంటే" అంటూ ఊహాగానాలు చేస్తున్నారు. అది కుప్ప కూలినప్పుడు కేరింతలు కొట్టి వర్గరహిత దృష్టితో ప్రపంచాన్ని చూసిన మేధావులు తమ తప్పేమిటో వెనక్కి తిరిగి చూచుకుంటున్నారా?

ప్రజలకోసం, ప్రజలచేత నిర్వహించ బడే ఒకే పాలన ప్రజాస్వామిక పాలన అన్నారు. కాని ఈనాడు మన ఆలోచనలు 'కండిషన్' చేయబడ్డాయి. ప్రజలకు ఓట్లు, ఒకరికి మించి అభ్యర్థులు, వారిలో ఒకరికి ఓటుద్వారా ప్రజలు సమ్మతి తెలియజేయడంగా పరిమితమైపోయాయి.

ఒకరికి మించి పోటీపడే వారు లేకుంటే, ప్రజలు భిన్నరూపంలో ఒక పరిపాలనకు తమ సమ్మతి తెలియచేసినా, అది ప్రజా స్వామిక పరిపాలన అని అంగీకరించే స్థితిలో మనం లేము. మన దృష్టిలో - కోర్టు తీర్పును అనుకూలంగా మలచుకొని అధికారంలోకి వచ్చిన బుష్ జూనియర్ ప్రజాస్వామిక వాది. పెట్రో - మిలటరీ కాంప్లెక్స్ ధనంలో, వారి సేవకోసమే అంకితమై ప్రపంచాన్ని చాపచుట్టాలని చూస్తున్నా ప్రజా ప్రతినిధే, ముస్లిం ప్రజలను ఊచకోతకోసి, భయోత్పాతం సృష్టించి అయినా సరే ఎన్నికలలో గెలిచిన నరేంద్రమోడీ ప్రజాస్వామిక వాదే. ఓటర్లతో అత్యధిక సంఖ్యాకులు ఓటింగ్‌కు రాకున్నా, రిగ్గింగ్ చేసినా, కులమతాల ప్రాతిపదికగా ఎన్నికైనా, డబ్బు, సారాలో ముంచి గెలిచినా - గెలిచిన వారు ప్రజాస్వామిక వాదులే.

ఒక వెనుక బడిన దేశాన్ని, దేశ, అంతర్జాతీయ ప్రతిఘటనల మధ్య, పది సంవత్సరాల శ్రమతో అత్యంత ఆధునికమైన, శక్తివంతమైన దేశంగా బోల్షివిక్ పార్టీ రష్యాను తీర్చిదిద్దింది. ఆధునిక రాక్షసత్వానికి మారుపేరుగా నిలిచిన ఫాసిజాన్ని ఓడించి ప్రపంచాన్ని - ఔను, నిజంగానే ప్రపంచాన్ని రక్షించిన త్యాగాలకు అన్ని జాతుల ప్రజలను ఉత్సాహపరచి, త్యాగ ధనులను చేసిన బోల్షివిక్ పరిపాలనను - ఓటింగ్‌లో

ఒకరికి మించి అభ్యర్థులు లేరు గనుక - ప్రజాస్వామిక పరిపాలనగా మనం ఆమోదించలేనంతగా "వెస్ట్ మినిస్టర్ డెమోక్రసీ" తన ప్రతిబింబాలుగా మనలను తయారు చేసింది.

"స్వదేశీ-స్వచ్ఛమైన పాలన" అని వాగ్దానం చేసి, ఓటు వేసిన వారిలో నూటికి 25 మంది సమ్మతితో, నానాగోత్రీకులను కలిపి అంకెలు పేర్చుకొని వాజ్‌పేయి అధికార పీఠమెక్కారు. దేశాన్ని విదేశీ పెట్టుబడులకు వేట భూమిగా తయారు చేశారు. లంచగొండి తనంలో రికార్డు స్థాయి నెలకొల్పారు. ప్రజల సొమ్ము కలవారికి కట్టబెట్టడంలో సిగ్గు ఎగ్గూ లేకుండా ప్రవర్తిస్తున్నారు. ఎన్నికల ముందు చెప్పిన పరిపాలనా నీతి, ఆచరణలో అనుసరించిన నీతి ఉత్తర, దక్షిణ ధృవాలుగా వున్నాయి. మరో ఎన్నికల దాక వేచి చూడడం తప్ప, ప్రజలకు ఇంకే పాత్ర లేదంటుంది ప్రజాస్వామిక రాజనీతి. ఈ నీతి పేర దొంగలు - దొంగలు ఊళ్లు పంచుకుంటున్నారు పార్లమెంటులో ఎటుకూర్చున్న వారైనా.

విప్లవం జయప్రదం చేశాము. సోషలిజం సాధించే మార్గం మంచిదని చెపుతున్నాం. ఏభై సంవత్సరాలు పాలించాం. మనదేశం సోషలిజం మార్గంలో పయనించాలా, లేదా, తీర్పు చెప్పండని క్యూబా తన ప్రజలను రాజకీయ విధానం నిర్ణయించమని కోరింది. ప్రజలు నిర్ణయం ప్రకటించే ముందు వేలాది సభలలో ఈ విధానపు ఆనుపానులు చర్చించారు. దేశం కొన్ని నెలల పాటు ఒక పెద్ద రాజకీయ పాఠశాలగా మారింది. సోషలిజం వైపు కొన్ని దేశాలు వేసిన అడుగుల అనుభవాలు వున్నాయి ప్రజలముందు. తమదేశం సాగించిన ప్రయాణం స్వయంగానే చవిచూచారు. ఆ అనుభవాలను మధించి "సోషలిజమే మార్గం" అని ఓటు వేశారు. అయినా అది ప్రజా తీర్పుకాదు. లోపం ఏమిటటా? నికరాగువాలో లాగ డాలరు, కాంట్రాలు తీర్పుకు సారధ్యులయ్యే అవకాశం లేనందున!!

సద్దాంతో ప్రారంభించి ఈ సిద్ధాంత రాద్ధాంతం ఏమిటని ప్రశ్నించచ్చు. సద్దాం ప్రజా స్వామిక వాది అని సర్టిఫికేట్ యిచ్చేందుకు రాస్తున్న మాటలు కావివి. ఆయన స్వభావాన్ని అంచనా వేసి, యోగ్యుడా, అయోగ్యుడా అని తేల్చవలసింది, తేల్చగలిగింది ఇరాక్ ప్రజలే. బుష్ జూనియర్ కాదు.

ఒక పాలకుడిని అంచనా వేసేందుకు 'ప్రజాస్వామిక వాది' 'నియంత' అని పేర్లు పెట్టేందుకు 'వెస్ట్ మినిస్టర్ ప్రజాస్వామ్యం' నిజమైన తూకం కాదు. ఒక వ్యక్తి అయితే నియంతో, లేకుంటే ప్రజాస్వామిక వాది మాత్రమే ఔతాడని చెప్పడం, నలుపు, తెలుపు తప్ప ప్రపంచంలో మరే రంగూ లేదని చెప్పడమే. "నాకు తోక కాకుంటే టెర్రరిస్టువే' అంటున్న బుష్ ప్రపంచ విభజనను ఒప్పుకోవడమే.

ఒక మనిషి, లేదా ఒక వ్యవస్థ తనకు ఎదురైన గతం నుండి, వారసత్వంగా తను పొందిన, తను ఎదుర్కొనే పరిస్థితులపైన ఆధారపడి తనరూపు రేఖలను దిద్దుకోగలుగుతుంది. ఏ పాలకుడు కాని ఈ సూత్రానికి భిన్నం కాదు. సద్దాం వ్యక్తిత్వం సంక్లిష్టం. చరిత్ర దిద్దిన పాలకుడు. సందర్భ శుద్ధి లేకుండా ఆ వ్యక్తిని ముద్రలు వేయడం న్యాయం కాదు. నిందించడం, అభినందించడం చాల సులభం. విశ్లేషించి మొత్తం రూపురేఖను కళ్లముందు వుంచడం కష్టతరం. అంతేగాదు సత్యాల పేరిట మన ఆలోచనలను కొన్ని ఘటనలను చూపే ఏక పక్ష అభిప్రాయంతో ప్రభావితమై వున్నప్పుడు, నిష్పాక్షికత ఎంతో కష్టమైన విషయం.

సద్దాం నియంత అని చెప్పేందుకు మనముందు పరచిన సాక్ష్యాలు మూడు.

1. స్వదేశంలో కుర్దులను ఊచకోతకోసి అణచివేశాడు.
2. ఇరాన్‌తో యుద్ధం చేశాడు. ఆసమయంలో సామ్రాజ్యవాదుల - ప్రత్యేకించి అమెరికన్ సామ్రాజ్యవాదుల బంటుగా వ్యవహరించాడు.
3. కువైట్‌పై దాడిచేసి దురాక్రమణకు పూనుకున్నాడు.

అందువల్ల అతను యుద్ధ పిపాసి. ఈ తృష్ణలో తన ప్రజలను ఉక్కు పాదాలతో అణచి వుంచాడు. అలా వుంచేందుకు, యుద్ధ తృష్ణ తీర్చుకునేందుకు అన్ని రకాల ఆయుధాలను, రసాయన మానవ సంహారపు ఆయుధాలతో సహా సమకూర్చుకున్నాడు.

ఆయుధాలను సమకూర్చుకున్నది నిజం. ఆదేశ ఆర్థిక వ్యవస్థను క్రుంగదీసేంతగా ఆయుధ వ్యయం జరిగింది. కాని ఈ ప్రాంతంలో ఏ దేశం సాయుధం కాదు? ఆ ప్రాంత మంతా వెనుకబడే వుంది. అందులో ఇజ్రాయిల్ అణ్వాయుధాలతో సహా, వాటిని ప్రయోగించే సాధనాలతో సమకూర్చుకుని మొత్తం మధ్య ప్రాచ్యానికే పక్కలో బల్లెమై, నిత్యం దాడులు చేస్తున్నది. ఈ

దాడులకు గురి కాకుండా వున్న సౌదీ అరేబియా ఆయుధాలకు పెడుతున్న వ్యయం, అమెరికా దృష్టిలో సమర్థనీయమే. దాడులకు గురౌతున్న దేశాలు సాయుధం కావడం నేరం. నిజానికి అభివృద్ధి చెందుతున్న దేశాల విదేశీ అప్పులలో అత్యధిక భాగం ఆయుధాలు సమకూర్చుకునేందుకు చేసిన రుణాలే.

వలస వాదం కుప్ప కూలిన తరువాత, వివిధ దేశాల మధ్య, దేశాలలో ఆంతరంగికంగా వందలాది ఘర్షణలు జరిగాయి. జరుగుతున్నాయి. భారత-చైనా సరిహద్దు, చైనా- రష్యా సరిహద్దు, భారత-పాక్‌ల మధ్య వివాదం ఇందుకు ఉదాహరణలు. ఆంతరంగికంగా అనేక దేశాలలో జరుగుతున్న జాతి (ఎథినిక్) ఘర్షణలు చూస్తూనే వున్నాం.

వీటన్నిటిలో కొద్దిపాటి వివరాలలో తేడాలు వుండవచ్చు రెచ్చగొట్టిన వారు ఎవరనే ప్రశ్న ప్రశ్నార్థమే కావచ్చు. కాని అన్నిటా పూసల్లో దారంలా వుండే కీలకం కారణం ఒకటే. సామ్రాజ్య వాదదేశాలు తమ తమ ప్రభావాల ప్రాంతాలను పంచుకునే సమయంలో దేశాల మధ్య గీచిన సరిహద్దు గీతలు నవురంలో వృద్ధిల బలాబలాలు తప్ప ఆయా దేశాల ప్రయోజనాలు ఏనాడూ వాటి దృష్టిలో లేదు.

చారిత్రకంగా అన్ని ప్రాంతాలలో నివసించే విభిన్న జాతుల ప్రజల అభివృద్ధిలో ఎంతో తేడాలు ఉన్నాయి. అందుకు కారణాలు అనేకం. మతమో, భౌగోళిక పరిస్థితులో కారణాలు ఒకనాడు. కాని అభివృద్ధి చెందిన దేశాలు వలస వాదం చేపట్టిన తరువాత, ఈ తేడాలు దేశాల మధ్యనే కాక, ఆయా దేశాలలో వివిధ ప్రాంతాలలో సహితం మరింత తీవ్రతరమైనాయి.

వలసవాదం అంతమైన తరువాత అన్ని దేశాలు, అన్ని జాతులు అభివృద్ధిని కోరుకోవడం సహజం. అప్పటి వరకు తమ అభివృద్ధిని పునాదిగా చేసుకొని, స్వంత పనుల మీద ఆధారపడి అందరు ప్రజలకు సుఖ జీవితం యివ్వడం అభివృద్ధి మార్గంగా ఎంచుకొని వుంటే, ఫలితాలు వేరుగా వుండేది. ప్రపంచంలోనే అత్యధిక జనాభా కలిగిన జన చైనా, సాంస్కృతిక విప్లవ కాలం వరకు సాధించిన శ్రేయోరీతి ఇందుకు చక్కని ఉదాహరణ. అలా కాక, రెండు శతాబ్దాలు పైగా అభివృద్ధి, అందుకు దోపిడీ అవకాశాలు పుష్కలంగా వున్న అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలను అనుకరించి, ఈ కాలాన్ని అంతా ఒక్క గెంతులో అధికమించి, వాటి సరసన స్థానం సంపాదించుకునే ప్రయత్నం మరొక అభివృద్ధి మార్గం. మనదేశం ఎంచుకున్నది ఈ మార్గం. ఇందుకు అవసరమైన సాంకేతిక నైపుణ్యానికి, పెట్టుబడికి గూడ పరోక్ష వలస వాదాన్ని ఆశ్రయించవలసి వచ్చింది. ప్రాంతాల మధ్య, జాతుల మధ్య, వర్గాల మధ్య అపూర్వమైన అసమానతలు తలెత్తాయి. ఇతరుల అభివృద్ధి అవకాశాలను దెబ్బతీసైనా ఎవరి అభివృద్ధి, శ్రేయస్సులను మాత్రమే వారు ఆలోచించే సంస్కృతికి దారితీసింది. సామ్రాజ్యవాదుల మృగ తృష్ణకు తోడ్పడుతున్న కీలకాంశం ఇదే. పైన వివరించిన చరిత్ర రూపు దిద్దిన వ్యక్తి సద్దాం హుసేన్.

చరిత్ర చేతి కీలుబొమ్మ అతను. చరిత్ర గతిని శాసించిన లెనిన్ కాడు అతను. అందుకు అవసరమైన సైద్ధాంతిక అవగాహన లేదు. వలసవాదం నుండి బయట పడేసరికి ఇరాక్-నిజానికి మధ్య ప్రాచ్యం అంతా గూడ - జాతుల సమాహారం తప్ప ఒక జాతిగా రూపొందిన దేశం కాదు. వలస వ్యతిరేక వుద్యమాలు ప్రపంచ వ్యాప్తంగా పొందిన విజయాలు కలిగించిన ఉత్సాహం.

ఏడవ శతాబ్దం వరకు ఇరాక్‌ను మెసపటోమిటా అనేవారు. అదే, బహుశా, ప్రపంచపు మొదటి నాగరికత. ఒట్టమాన్ టర్కిష్ సామ్రాజ్యంలో భాగం. ఉత్తరాన మోహన్, మధ్యలో బాగ్దాద్, దక్షిణాన బస్రా రాష్ట్రాలుగా వుండేది. మొదటి రాష్ట్రంలో అత్యధికులు కుర్దులు, బాగ్దాల్‌లో సున్నీ అరబ్‌లు, బాస్రాలో షియా అరబ్‌లు అత్యధికులుగా వుండేవారు. ఆ సామ్రాజ్యం క్షీణించ సాగేసరికి ఈ ప్రాంతంలో తమ ప్రభావం పెంచుకునేందుకు బ్రిటన్, ఫ్రాన్స్‌లు అపారంగా పెట్టుబడులు పెట్టాయి. రైల్వేలు, సూయజ్ కాల్వ వంటి ప్రాజెక్టులతో ఆ దేశాలను అప్పుల ఊబిలో దింపాయి. జర్మనీ, ఐరోపానుండి బాగ్దాద్‌కు రైల్వే లైన్ నిర్మాణానికి ప్రతిపాదించి అంగీకారం పొందింది. అప్పటికి ఆవిరి నుండి చమురుతో నావలు నడపవచ్చని అర్థమైంది. మధ్య ప్రాచ్యం చమురునిధుల గనిగా భావించారు. అక్కడితో ఆ రంగంలో పెట్టుబడులు ఆసక్తి పెరిగి, మొదటి ప్రపంచ యుద్ధంలో ఈ భాగం స్వాధీనం ఒక ప్రధాన అంశమైంది. మెక్కాకు చెందిన షెరీఫ్ హుసేన్‌తో టర్కీపై అరబ్‌లు తిరుగుబాటు చేస్తే, యుద్ధానంతరం ఆ ప్రాంత స్వాతంత్ర్యం బలపరచేందుకు బ్రిటన్ ఒప్పందం చేసుకుంది. బ్రిటన్, బాస్రాలు తన పెత్తన

క్రింద వుండాలని కోరింది. ఫ్రాన్స్‌తో చేసుకొన్న మరొక రష్యా ఒప్పందంలో మోసుల్ ఫ్రాన్స్‌కు, ఈశాన్యటర్కీని జారిస్టు రష్యాకు ధారాదత్తం చేసింది స్వంత భూభాగమైనట్లు.'

యుద్ధంలో జర్మనీ, టర్కీలు ఓడాయి. అరబ్ స్వాతంత్ర్య వాగ్దానం నీటిమీది రాతైంది. జారిస్టు రష్యా కూలిన తరువాత విప్లవ ప్రభుత్వం వీటిని బయట పెట్టింది.

బ్రిటిష్ సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా 1920లో ఇరాక్ తిరగబడింది. బ్రిటన్ గగన తలం నుండి బాంబుల వర్షంతో అణచింది. కాని తిరుగుబాట్లు నివారించేందుకు హెమైట్ కుటుంబానికి చెందిన అమీర్ ఫైజల్ I ను ఇరాకీ రాజును చేసింది. ఆయన చేసిన ఒప్పందానికి వ్యతిరేకంగా తిరిగి తిరుగుబాటు వచ్చి, అణచివేయబడి నాయకులను దేశ బహిష్కృతులను చేశారు. 1925 తిరుగుబాటు ఒప్పందాన్ని ఆలస్యం చేసింది. ఆపలేకపోయింది. వివిధ సామ్రాజ్య వాద దేశాల మధ్య బలాబలాలను బట్టి సరిహద్దులు గీశారు. చెరిపారు, తిరిగి గీశారు. ఇందులో అత్యధికంగా నష్టపోయింది కుర్దులు. వారి భూభాగం టర్కీ, సిరియా, ఇరాక్. ఇరాన్‌లు పంచుకున్నాయి.

ఇరాన్‌తో యుద్ధానికి, టర్కీతో కయ్యానికి సామ్రాజ్య వాదులు సృష్టించిన ఈ కుర్దుల సమస్య కీలకం. మొదట ప్రపంచ యుద్ధం జర్మనీని ఓడించింది. కాని మరొక సంపన్న పోటీదారును సృష్టించింది. అదే అమెరికా. చమురు వాణిజ్యంలో నాల్గవ బాగం సంపాదించుకుంది.

ప్రజల స్వాతంత్ర్య పిపాసను అడ్డుకోలేక, 1932 లో ఇరాక్‌కు - కాదు ఇరాక్ రాజుగారికి, తన కీలు బొమ్మగా వుండే షరతుపై "స్వాతంత్ర్యం" యిచ్చింది. అయితే ఇరాకీ సైన్యం, రాజకీయ పార్టీలు రాజు గారిపై తిరుగుబాటు చేసి "ఆగ్జిస్, పవర్స్" తో ఒప్పందం కోసం కృషి చేశాయి. ముందే బ్రిటన్ దాడి చేసి, తొత్తు ప్రభుత్వం ద్వారా తన పెత్తనం కొనసాగించింది. ఇస్రాయిల్ ఏర్పాటు ప్రయత్నాలకు 1948లో మరొక తిరుగుబాటు జరిగింది. విదేశాంగ విధానాన్ని బ్రిటన్ గుప్పెట్లో పెట్టే ఒప్పందానికి, పాలస్తీనీయులను తరిమి వేసినందుకు నిరసనగా ఈ పోరాటం. ఒప్పందం రద్దు, ప్రధాని రాజీనామాలతో ముగిసింది.

1951లో ఇరాన్ చమురు పరిశ్రమను జాతీయం చేసింది. ఇరాక్‌లోనూ ఆ విధానం కోసం 1952లో మరొక తిరుగుబాటు జరిగింది. బ్రిటన్ మార్షల్ లా ప్రకటించింది. 1954 నాటికి అన్ని రాజకీయ పార్టీలను అణచివేశారు. ఇరాన్ చమురు పరిశ్రమను జాతీయం చేసిన ప్రభుత్వం అమెరికా గూఢచారి సంస్థ సిఐఎ కుట్రతో 1953లో కూల్చివేయబడింది. ఈ రెండు సంవత్సరాలు ప్రపంచ చమురు సంస్థలు ఇరాన్ చమురును బహిష్కరించాయి. మరొకవైపు అరబ్ ప్రజల అలజడి పెరిగింది. ఆ ప్రాంతమంతా అట్టుడికింది. 1952 తిరుగుబాటులో నాజర్ అధికారానికి వచ్చి సూయజ్‌ను జాతీయం చేశాడు. అరబ్ ప్రజల నాయకుడైనాడు. సౌదీ, ఇరాక్‌లలో చమురు కార్మికులు సమ్మె చేశారు. అమెరికా ఆయుధాలతో వాటిని అణచివేశారు. సౌదీ, ఇరాన్ రాజులు సన్నిహిత బంధువులు 1957 జోర్డాన్ రాజు ప్రధానిని బర్తరఫ్ చేసి, పార్లమెంటును రద్దుచేసి, రాజకీయ పార్టీలను చట్ట విరుద్ధంగా ప్రకటించి, వ్యతిరేకులను కాన్‌సన్‌ట్రేషన్ క్యాంపులకు పంపాడు.

జోర్డాన్‌లోని మితవాద ప్రభుత్వం జాతీయ వాదులను 1958లో అణచివేసింది. ఇలాంటి ప్రభుత్వాలకు అమెరికా ఆర్థిక, ఆయుధ సహకారాలు అందించ సాగింది. అమెరికా బ్రిటన్‌లకు అనుకూల ప్రభుత్వాలు వున్న పాకిస్తాన్, ఇరాక్, టర్కీలతో అమెరికా బాగ్దాద్ సైనిక కూటమిని ఏర్పర్చింది.

1958లో అబ్దుల్ కరీం ఖాసిం నాయకత్వాన గల సైనిక విభాగం తిరుగుబాటు జరిపి, రాజును వురితీసి, ఇరాక్‌ను రిపబ్లిక్‌గా ప్రకటించింది. చమురు ఉత్పత్తి చేసే దేశాలలో సామ్రాజ్యవాద తొత్తు ప్రభుత్వాలను కూల్చిన మొదటి ఘటన ఇదే. అమెరికా సైనిక జోక్యానికి తలపెట్టింది. కాని సహాయపడే నాదుడు కరువైనాడు. తన చమురు ప్రయోజనాలకు భంగం కలిగిస్తే... అంటూ అమెరికా కళ్లెర్ర జేసింది. వాటిని భగ్నపరచమని తిరుగుబాటు దార్లు వాగ్దానం చేశారు. కాని ప్రజలలో అలజడి తగ్గలేదు.

ఇరాక్‌లో అమెరికా కంపెనీలు పెట్టింది 50 మిలియన్ డాలర్లు. ఒక్క 1963లోనే వాటి లాభాలు 322.9 మిలియన్ డాలర్లకు పెరిగాయి. కంపెనీల విధానం లాభదాయకంగా చమురు పరిశ్రమను అభివృద్ధి చేయడం కాదు. రాజకీయ వ్యూహాల ప్రకారం వ్యాపారం నడిపాయి.

ఇరాక్‌చమురు నిక్షేపాలను గాని, శుద్ధి సౌకర్యాలను గాని పెంచే ఉద్దేశ్యం ఆయిల్ కంపెనీలకు లేదు. తనకు హక్కులున్న చమురు గనుల్లో 0.5 శాతం మాత్రమే ఇరాక్‌లో అవి అభివృద్ధి చేశాయి. ఉత్పత్తి రెట్టింపు చేయాలని, శుద్ధి సౌకర్యాలు పెంచాలని, తను ఉపయోగించని బావుల్లో 60 శాతం ప్రభుత్వానికి ఒప్ప జెప్పాలని ఖాసిం డిమాండ్ చేశాడు. ఆయిల్ కంపెనీలు సమాధానంగా ఉత్పత్తి తగ్గించాయి. ఇరాక్ బాగ్దాద్ ఒప్పందం నుండి ఉపసంహరించుకుంది. బ్రిటిష్ కరెన్సీ ఆధిపత్యం తొలగించింది. ఆర్థిక, సాంకేతిక రంగాలలో సోవియట్‌తో ఒప్పందం చేసుకుంది. బ్రిటిష్ సేనలకు స్థావరం లేకుండా చేసింది. 1961 నాటికి చమురు సంస్థలతో రాజీ సంప్రదింపులు రద్దు చేశారు. అప్పటికే చమురు సంస్థలు అభివృద్ధి చేసిన 0.5 శాతం తప్ప, మిగతా బావులను ప్రభుత్వానికి స్వాధీనం చేయాలని కోరారు. చమురు సంస్థలు ఉత్పత్తి మరింత తగ్గించాయి. అమెరికా ప్రభుత్వం ఖాసింని చెదిరించడమేకాదు, మరొక నాలుగు రోజులలో అధికారం నుండి కూల్చివేసింది.

తిరుగుబాటు చేసింది అరబ్ సోషలిస్టు బాత్‌పార్టీ, సైనిక విభాగం ఒకటి. అధికారం రాగానే తోడు దొంగలు బాత్ పార్టీకి సున్నా చుట్టారు. కొత్త పాలకులు చమురు కంపెనీలకు మరొక 0.5 శాతం గనులు ధారాదత్తం చేశారు. ఇందులో సంపన్నవంతమైన ఉత్తర రుమైలా గూడ వుంది. ఆయిల్ కంపెనీలు ప్రభుత్వ సంస్థతో కలిసి, చమురు రంగ అభివృద్ధికి ఒప్పందం చేసుకున్నాయి. ప్రజలు నిరసనల మధ్య ఆ ఒప్పందం అమలు కాలేదు. 1961-68 మధ్య చమురు రంగ అభివృద్ధి నామమాత్రమే. చమురు రాయల్టీలే ప్రభుత్వాదాయం. రాయల్టీకి మూలం చమురు ఉత్పత్తి. ఆ ఉత్పత్తి మొత్తం తగ్గించి, ఒక దశాబ్దం పాటు ఇరాక్ అభివృద్ధికి ఆటంకాలు కలిగించాయి అమెరికా, బ్రిటన్‌లు వారి చమురు కంపెనీలు.

అమెరికా ప్రతిష్ఠించిన ఇరాన్ ప్రభుత్వం సిరియా, ఈజిప్ట్, జోర్డాన్ భూభాగాలను ఆక్రమించింది. 1961లో ఇరాన్‌తో యుద్ధంలో ఇరాక్ గూడ ఇరుక్కుంది.

1968లో బాత్ పార్టీ తిరుగుబాటుతో అధికారానికి వచ్చింది. చమురు రంగ పరిశ్రమ స్వాధీనానికి నాలుగేండ్లు ప్రయత్నించింది. 1972 నాటికి మాత్రమే ఇరాక్ తన చమురు పరిశ్రమను స్వాధీనం చేసుకుంది. ఇంత కీలకమైన పరిశ్రమను సాంకేతికంగా అభివృద్ధి చేసుకోలేదు. ఫ్రాన్స్, సోవియట్‌ల సహాయంతో సామ్రాజ్యవాద కౌగిలిని మాత్రం విడిపించుకుంది. 1968 తిరుగుబాటు నాటికి సద్దాం హుసేన్ బాత్ ఎర్టీ ఉపాధ్యక్షుడు మాత్రమే.

ఇరాక్‌లో చమురు జాతియీకరణతో మధ్యప్రాచ్యం కుతకుతలాడింది. 1969లో లిబియా రాచరికం కూలింది. పాలస్తీనా సాయుధ పోరాటం ప్రారంభమైంది. 1973లో ఇజ్రాయిల్‌తో యుద్ధం. అరబ్ దేశాలు చమురు సరఫరాలపై ఆంక్షలు విధించారు. చమురు ధరలు పెంచాయి.

రాచరికం రద్దు వరకు ఇరాక్ వ్యవసాయక దేశం. రాచరికం రద్దు తరువాత 1974లో అధిక ధరలతో వచ్చిన ఆదాయంతో అభివృద్ధికి, శ్రేయోరాజ్య నిర్మాణానికి వ్యయం పెరిగింది. గృహ నిర్మాణం అపారమైంది. ప్రజల జీవన ప్రమాణాలు పెరిగాయి. పారిశ్రామిక విస్తరణకు, భిన్న పరిశ్రమల ఏర్పాటుకు పారిశ్రామిక, వ్యవసాయ వుత్పత్తుల ఉత్పత్తి పెంచి, దిగుమతులు తగ్గించింది. చమురేతర ఉత్పత్తుల ఎగుమతులు పెంచింది. మంచినీరు, సాగునీరు, రోడ్లు రైల్వేలు, గ్రామీణ విద్యుత్ వంటి మౌలిక సదుపాయాలను బాగా పెంచింది. లౌకిక విద్యా విధానం ప్రవేశ పెట్టింది. సాంకేతిక విద్యకు ఎంతో వ్యయం చేసి చక్కని యువ నిపుణులను తయారు చేసుకుంది. మహిళలకు విద్యావకాశాలు, ఉపాధి అవకాశాలు పెంచింది. పారిశ్రామిక రంగంలో ప్రభుత్వ రంగాన్ని విస్తరించింది. ఒక్క ముక్కలో చక్కని సంక్షేమ రాజ్యం ఏర్పర్చింది. అమెరికా అనుకూల సౌదీ, కువాయట్, యు.ఏ.ఇ.ల అనుభవానికి ఇది పూర్తిగా విరుద్ధమైన చిత్రం.

పెట్రోలియం ధరల పెరుగుదలతో సమకూరిన అపారమైన నిధులతో అమెరికాకు పెట్రోడాలర్లు పెంచాయి ఈ దేశాలు. ఇరాక్ ఆ నిధులను తన దేశ అభివృద్ధికి ఖర్చు చేసింది.

1958 హెమసైట్ కుటుంబాన్ని కూలద్రోసి ఇరాక్ విప్లవం జయప్రదమైంది. సామ్రాజ్యవాదులు సృష్టించిన సరిహద్దులతో కుర్దుల మధ్య, ఇరాకీయుల మధ్య ఘర్షణలు నిత్యకృత్యమైనాయి. అయితే విప్లవ ప్రకటన ఈ పరిస్థితిని మార్చింది. ఇరాక్ అంటే అరబ్ - కుర్దు జాతుల సమాహారం

అని అంగీకరించి కుర్దులకు పరిపాలనలో సహేతుకమైన భాగం వాగ్దానం చేసింది. కాని అంతర్గత అనిశ్చిత స్థితిలో ఈ వాగ్దానం నెరవేర్చడం ఆలస్యమైంది. దీనితో కుర్దులలో వస్తున్న అసంతృప్తిని ఇజ్రాయల్ పెంచిపోషించ సాగింది. ప్రత్యక్షంగా పలురకాల సహాయం అందించసాగింది. అరబ్‌లకు - ఇజ్రాయల్ ఘర్షణలలో కుర్దులు ఇజ్రాయల్ పావులైనారు. 1968లో బాత్ సోషలిస్టులు అధికారానికి రావడంతో ఈ రెండు జాతుల ఘర్షణ మరింత తీవ్రతరమైంది. కాని మార్చి 1970 నాటికి ఇరాకీ కుర్దులకు స్వయం పరిపాలనా వ్యవస్థ ఏర్పర్చేందుకు, ఘర్షణలు నిలిపివేసేందుకు అంగీకారం కుదిరింది.

కాని ఐక్య ఇరాక్‌ను సహించే స్థితిలో ఇరాన్ షా లేడు. తిరిగి ఘర్షణలు పెంచేందుకు రెండు దేశాల మధ్య సరిహద్దు ఒప్పందం రద్దు చేశాడు. షాట్-అల్-అరబ్ అనే నది సరిహద్దు. ఆ ఒప్పందం జరిగింది 1937లో. ఈ ఒప్పందాన్ని షా విసర్జించాడు. బాత్ పరిపాలనను కూలద్రోసేందుకు మితవాదులు చేసిన ప్రయత్నాన్ని సమర్థించాడు. బ్రిటన్ వదలి వెళ్తున్న అరబ్ ప్రాంతాలైన అబూ మూసా, టునుబ్స్ ఆక్రమించుకుంది. బాత్ పాలనకు, పశ్చిమ దేశాల చమురు కంపెనీలకు జరిగిన ఘర్షణ పెరిగింది. 1972లో చమురు నిక్షేపాలను జాతీయం చేశారు. అరబ్-ఇస్రాయెల్ యుద్ధం తీవ్రతరమైంది. షా, అమెరికా అధ్యక్షులు నిక్సన్ కలసి ఇరాక్, సిరియాలలో కుర్దులను రెచ్చగొట్టసాగాడు.

ఉపాధ్యక్షుడుగా సద్దాం ఈ ఘర్షణలలో ఇరాన్ దూరం చేసేందుకు 1975లో సగం నదిని సరిహద్దుగా ఆమోదించాడు. కుర్దులను ప్రోత్సహించడం నిలిపివేసేందుకు షా ఆమోదించాడు. ఇజ్రాయెల్‌తో సాగే యుద్ధంలో ఇరాక్ పాల్గొనకుండా చూచేందుకే కుర్దులను రెచ్చగొట్టామని కిసింజరే అంగీకరించాడు.

ఇరాక్‌లో కుర్దు తిరుగుబాటు దార్లపై తప్ప, సాధారణ ప్రజలపై ఎలాంటి ఆంక్షలు లేవు. సరిగదా వారి సాంస్కృతిక జీవిత వికాసానికి, విద్యా వ్యాసంగాలు పెరిగేందుకు దోహదపడింది. కుర్దూ ఆమోదించిన దేశం ప్రపంచంలో ఇరాక్ ఒక్కటే. న్యూయార్క్‌లోని కుర్దిష్ లైబ్రరీలో వున్న అత్యధిక కుర్దూ గ్రంథాలు ఇరాక్ ప్రచురించినవే. ఇరాక్‌లోని సులై మాన్యాలో కుర్దు విశ్వ విద్యాలయం వుంది.

ఇందుకు భిన్నంగా టర్కీలో ఇండ్లలో తప్ప, చిన్న సమావేశాలలో సహితం ఒకరితో ఒకరు ఆ భాషలో మాట్లాడరాదనే నిషేధం వుంది. కుర్దుల ప్రత్యేకత గుర్తు చేస్తూ ఒక చిన్న సమావేశంలో పాటపాడిన నేరానికి అనేక మంది కుర్దు యువకులు జైళ్ల పాలైనారు.

1979లో పహ్లవీ రాజరికపు షాను కూల్చి, మత ఛాందసులు అధికారం చేపట్టారు. అభ్యుదయ కరము, శ్రేయోదాయకమైన ఇరాక్‌ను మతఛాందసం కూల్చాలనుకున్నది. కుట్రలు ప్రారంభించింది. సరిహద్దులలో ఘర్షణలు ప్రారంభమైనాయి. ఇరాక్-ఇరాన్ ఘర్షణ ప్రారంభమైంది.

***(మిగతాది వచ్చే సంచికలో)...***

---

***(4వ పేజీ తరువాయి)***

నిర్మించడం వల్ల ప్రయోజనమేమీ లేదు. ప్రాజెక్ట్ కమాండ్ ఏరియాలో చెక్‌డ్యాం నిర్మాణాలు మంచి ఫలితాలను ఇవ్వనున్నా, ప్రభుత్వం చెక్‌డ్యాంల నిర్మాణంలో ఉలుకూ. పలుకూ లేని విధంగా ప్రవర్తిస్తుంది. మొత్తానికి ప్రజల అనుభవంతో తేలిందేమంటే వంకలు, వాగులు, నదులు దినాల తరబడి ప్రవహించినపుడు మాత్రమే భూగర్భ జలాలు పెరుగుతాయని, ఈ ప్రక్రియను మరింత మెరుగుపరచడానికి చిన్న వాగులకు అడ్డంగా చెక్‌డ్యాంల నిర్మాణాలు ఉత్తమ ఫలితాలనిస్తాయని తెలుస్తుంది. ఈ విధమైన కార్యక్రమాల వైపు దృష్టి పెట్టకుండా, తద్వారా భూగర్భ జలాలను అభివృద్ధి పరచకుండానే ఇప్పుడు భూగర్భజలాల లభ్యతపై ప్రధానంగా ఆధారపడే బిందుసేద్యం, సూక్ష్మసాగు విధానానికి శ్రీకారం చుట్టడం అంటే ఇది కచ్చితంగా రూపం మార్చుకుని మారుపేరుతో వచ్చిన మరో నీరు-మీరు కార్యక్రమానికి కొనసాగింపు మాత్రమే.

నిత్యం జరుగుతున్న అనేక ప్రభుత్వ అవినీతి విధానాల నుండి ప్రజల దృష్టిని మల్లిస్తూ, ఎప్పటికప్పుడు ఆచరణతో సంబంధం లేని పథకాలను వేల కోట్ల ఖర్చుతో ప్రచారం చేసుకోవడం ప్రభుత్వ విధానాల్లో భాగం అయింది. సమస్యలకు శాశ్వత పరిష్కారం చేపట్టకుండా సమస్యలను ఎప్పుడూ సజీవంగా ఉంచడం అన్నది ప్రస్తుత ప్రభుత్వాలకు తప్పనిసరి అయిపోతుంది. ఐదేళ్ల కొకసారి వచ్చే ఎన్నికల ఋతువులో అధికారం పంట పండించుకోవడానికి సజీవమైన సమస్యలను రాజకీయ పార్టీలు పెట్టుబడులుగా ఉంచుకుంటాయన్న విషయంలో ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం చక్కటి ఉదాహరణ. ❐

# ఈ సబ్సిడీలను ఎందుకు రద్దు చేయరు?

- వి. హనుమంతరావు

**పేదవాడికి**, రైతుకు సబ్సిడీ ఇవ్వమంటే గింజుకొనే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఎగుమతిదారులను ప్రోత్సహించే పేరుతో కార్పోరేట్ సంస్థలకు, ఎగుమతిదారులకు దోచిపెడుతున్నాయి. మొన్న ఏప్రిల్ ఒకటవ తేదీన ప్రకటించిన ఎగుమతి దిగుమతి విధానాన్ని చూసి ఎగుమతిదారులు ఉబ్బితబ్బిబ్బయ్యారు. మంత్రి జైట్లీకి హారతులు పట్టారంటే, ఆ విధాన ప్రకటన వారికెంత లాభసాటిగా వుందో ఇట్టే అర్థమవుతుంది. విధాన ప్రకటన మొదటినుంచి చివరదాకా అన్నీ ప్రోత్సాహకాలే, మినహాయింపులే. ఇది సబ్సిడీకి మరో ముద్దుపేరు. ఏరాయి అయితేనేం పళ్ళూడగొట్టుకోవడానికి?

ఎగుమతి చేసిన దేశీయ ఉత్పత్తులతో సంపాదించిన విదేశీమారకం దిగుమతులకు చెల్లించడానికి సరిపోతే సమతుల్యత సాధ్యమవుతుంది. అభివృద్ధి చెందుతున్న దేశాలకు దిగుమతుల అవసరాలే ఎక్కువగా ఉంటాయి కాబట్టి, ఈ సమతుల్యత సాధ్యం కాకపోవచ్చు. కాని 55 సంవత్సరాల తర్వాత కూడా అది సాధ్యంకాలేదంటే, ఎక్కడో విధానలోపం ఉందనేది స్పష్టం. ఈ వైఫల్యం పరాకాష్టే 1991లో ఏర్పడిన సంక్షోభం, పురాణాల్లో గజేంద్రుడు మొర పెట్టుకొన్నట్లు ఐ.ఎం.ఎఫ్., ప్రపంచ బ్యాంకులను రక్షించమని వేడుకోవటం, రుణం తెచ్చుకొని, వడ్డీలు చెల్లించటం జరుగుతూంది. దీని నుంచి బయట పడాలంటే ఎగుమతులు పెంచుకోవాలి. కాని కేంద్ర ప్రభుత్వాలు తల కిందులు తపస్సు ప్రారంభించింది. దిగుమతి సుంకాలను తగ్గించుకొంటూ పోవటంతో (మొత్తం పన్ను ఆదాయంలో కస్టమ్స్ సుంకం ఆదాయం 1990-91లో 48.03 శాతం నుంచి 2000-01 బడ్జెట్ అంచనా ప్రకారం 36.64 శాతానికి పడిపోయింది.) దిగుమతులకు ఎగుమతులకు మధ్య అంతరం పెరుగుతోంది. బాలెన్స్ ఆఫ్ పేమెంట్స్ పట్టిక ప్రకారం

(కోట్ల రూ.)

| | ఎగుమతులు (సి.ఐ.ఎఫ్) | దిగుమతులు (ఎఫ్.ఒ.బి.) | తేడా |
|---|---|---|---|
| 1990-91 | 33153 | 50086 | 16933 |
| 1995-96 | 108482 | 146543 | 38061 |
| 1999-00 | 162753 | 240112 | 77359 |
| 2001-02 | 214351 | 274778 | 60427 |

ప్రపంచబ్యాంకు దేశంలో అడుగుపెట్టిన వేళా విశేషం ఎలాంటిదంటే ఎగుమతులు, దిగుమతుల మధ్య అంతరం దగ్గరదగ్గరగా నాలుగురెట్లు పెరిగింది. ఎగుమతులు ఇంత పెరిగాయి, అంత పెరిగాయి అని డబ్బా వాయిస్తారే కాని, అంతరం పెరిగిన విషయం గురించి మాత్రం చెవిలో గుసగుసలాడుతారు. ఉదాహరణకు తాజా విధాన ప్రకటనలో 2002-03లో ఎగుమతులు 48 బిలియన్ డాలర్లకు చేరుకొన్నాయని, ఆ ఆర్థిక సంవత్సరానికి 50 బిలియన్ డాలర్లు చేరుకొంటాయని, ఆశాభావం వెలిబుచ్చారే కాని ఎగుమతి-దిగుమతుల మధ్య అంతరం గురించి ఒక్కమాట చెప్పలేదు. గత సంవత్సరం నాటికే 1500 వస్తువుల మీద పరిమాణాత్మక ఆంక్షలు తొలగించారు. తాజా ప్రకటనలో 69 వస్తువుల దిగుమతుల మీద ఆంక్షలు తొలగిస్తున్నట్లు ప్రకటించారు. మన దేశంలో ఏ వస్తువులు తయారవుతున్నాయో, వాటి దిగుమతులనే అనుమతిస్తే, మన పరిశ్రమలు పండుకొంటాయి. ఎగుమతులు చేసే శక్తి సన్నగిల్లుతుంది. ప్రపంచ వ్యాప్తంగా ఆర్థిక మాంద్యం నెలకొన్న పరిస్థితుల్లో, అంతర్జాతీయంగా పోటీ పెరిగి ధరల విషయంలో భారత దేశం పోటీ పడలేక పోతుంది. నాణ్యత విషయంలో ఎపుడో మన ఎగుమతులు పరీక్షకు నిలవలేదు. ఇరాక్ దురాక్రమణ, ఇంకా ఎన్ని దేశాల దురాక్రమణకు దారి తీస్తుందో దురాక్రమణ చేస్తున్న అమెరికాకే తెలియదు. ఇది అంతర్జాతీయ వ్యాపారాన్ని ప్రతికూలంగా ప్రభావితం చేస్తుంది. కాగా ఒక పక్క దిగుమతులు పెరిగి, ఎగుమతులు తగ్గితే, అంతరం ఇంకా పెరుగుతుంది. ప్రపంచ బ్యాంకు, ఐ.ఎం.ఎఫ్., డబ్ల్యు.టి.వో. సంస్థలు భారతదేశం మీద ముప్పేట దాడి సాగిస్తున్నాయి. ఈ పరిస్థితి రాజకీయ ఒత్తిడులకు కూడా దారి తీయవచ్చు.

ఎగుమతుల పెరుగుదల మీదే ప్రభుత్వం తన దృష్టి కేంద్రీకరించిందని పైన చెప్పుకొన్నాం. ఎగుమతులు పెరగాలంటే, ఆ సుంకం తగ్గించండి, ఈ పన్ను తీసేయండి, అంటూ

ఎగుమతిదారులు ప్రభుత్వం మీద చేస్తున్న ఒత్తిడికి లొంగి అనేక రకాల మినహాయింపులు, ప్రోత్సాహకాలు కేంద్రం ప్రకటిస్తూనే వుంది. అలాగే ప్రపంచ బ్యాంకు, డబ్ల్యు.టి.వో. షరతుల మేరకు కస్టమ్స్ సుంకాలు తగ్గించేస్తూంది, ఆంక్షలు ఎత్తివేస్తుంది. ఉదాహరణకు భారీ యంత్రాల దిగుమతుల మీద సుంకాలను తగ్గించే పథకం ఫలితంగా 1998-99లో రు.15,492 కోట్ల రూపాయల రాయితీ ఇచ్చిందని, ఆ మేరకు ప్రభుత్వం తనకు రావల్సిన ఆదాయాన్ని కోల్పోయిందని 2000 సంవత్సరం కాగ్ నివేదిక చెప్పింది. 1995-99 మధ్య కాలంలో మొత్తం రు. 52,864 కోట్ల ఆదాయం పోగొట్టుకొంది. ఇది సబ్సిడీ కాక మరేమిటి? కస్టమ్స్ చట్టంలో ఆనాడు మరో రెండు క్లాజుల కింద అంతకుముందు అయిదు సంవత్సరాల్లో రు. 5,873 కోట్లు సబ్సిడీ ఇచ్చింది. అంతా కలిపి రు. 58,737 కోట్లు సబ్సిడీ ఇచ్చినట్లయింది.

జవహర్‌లాల్ నెహ్రూ విశ్వ విద్యాలయం ప్రొఫెసర్, ప్రముఖ ఆర్థిక కాలమిస్టు జయతీ ఘోష్ ఇచ్చిన గణాంకాల ప్రకారం ఎగుమతులకు ప్రోత్సాహక రూపంలో 2001-02లో రు. 23,000 కోట్లు ఎగుమతిదారులకు ముట్టింది. 2002-03లో అది రు. 27,000 కోట్లకు చేరుకోవచ్చునని అంచనా వేసింది. ఇది కస్టమ్స్ సుంకం మొత్తం ఆదాయంలో 60 శాతం వుంటుంది. ఇదికాక ఎగుమతులకు ప్రోత్సాహకాల పేరుతో ఎగుమతులకు అవసరమైన మౌలిక సౌకర్యాలకోసం వేలకోట్ల రూపాయలు ఖర్చు చేస్తోంది. ఇలా గోనెసంచుల్లో సబ్సిడీలను అందిపుచ్చుకొన్న ఎగుమతిదారులు ఈ సౌకర్యాలను సద్వినియోగం చేస్తున్నారా అంటే అదీ లేదు. ఉదాహరణకు అక్టోబరు 2002 నుండి మార్చి 2003 వరకు కేవలం ఆరు నెలల్లో బియ్యం ఎగుమతిదారులు ప్రభుత్వం అత్యధిక సబ్సిడీని వినియోగించుకొని ఫుడ్ కార్పోరేషన్ నుంచి టన్ను రు. 5,760 సబ్సిడీలు ధరకు కొని, స్థానిక మార్కెట్‌లో రు. 9000 కు అమ్ముకొని రు. 162 కోట్లు లాభం ఆర్జించారు. ఓవర్ ఇన్వాయిసింగ్, అండర్ ఇన్వాయిసింగ్ (బిల్లులు ఎక్కువ వేయడం, తక్కువ వేయడం ద్వారా) అక్రమ లాభాలు చేసుకొని, దేశ ఆదాయాన్ని దెబ్బతీసి వేలకోట్ల విదేశీమారక ద్రవ్యాన్ని విదేశీ బ్యాంకుల్లో దాచుకొన్నారు. ఈ అక్రమ సంపదను అనేక రకాలుగా దేశంలోకి తీసుకొని వచ్చి, వైట్ మనీ గా చలామణీ చేస్తున్నారు. ఇది కాక స్మగ్లింగ్ ద్వారా కూడా అదనపు ఆదాయాన్ని సంపాదిస్తున్నారు. ఇన్నివేలకోట్ల సబ్సిడీలు ఎగుమతిదార్లకు, కార్పొరేట్ సంస్థలకు ఇస్తూ, రైతులకు సబ్సిడీ ఇవ్వాల్సి వచ్చే సరికి గుప్పిడి మూసేస్తుందెందుకు?

ఇంత కుస్తీ పట్టినా, ఇంత సబ్సిడీ ఇచ్చినా ప్రపంచ వాణిజ్యంలో మన వాటా చదవేస్తే ఉన్నమతి కూడా పోయిందన్నట్లు 50వ దశకం ప్రారంభంలో ఒకశాతం నుంచి 2002లో 0.67 శాతానికి పడిపోయింది. మనకన్నా ఎంతో చిన్న దేశమైన ఫిలిప్పైన్స్ వాటా ఎంతవుందో, ఇంత పెద్ద దేశమైన భారత వాటా కూడా అంతే. మనం సిగ్గుతో తల వంచుకోవాలి. ఆసియా దేశాల్లో ఎగుమతులు తగ్గకపోగా, పెరిగిన దేశమేదైనా వుంటే అది చైనా మాత్రమే. 1978లో చైనా సంస్కరణలు ప్రారంభించినపుడు ప్రపంచ వాణిజ్యంలో ఆదేశం వాటా 0.9 శాతం కాగా ఇపుడు నాలుగు శాతానికి పెరిగింది.

గత సంవత్సరమే 2007 వరకూ వర్తించే ఎగుమతి-దిగుమతుల విధానాన్ని ప్రకటించిన కేంద్రం ఈ సంవత్సరం ఆ విధానాన్ని సవరిస్తూ మరో పత్రాన్ని ప్రకటించాల్సి వచ్చిందంటే, ఈ నూతన విధానంలో సేవల ఎగుమతి కేంద్ర బిందువుగా వుంటుందని చెప్పారంటే వ్యవసాయ, పారిశ్రామిక రంగాల ఎగుమతులు పెరక్కపోయి వుండాలి. లేదా కంప్యూటర్ గుమాస్తాల పుణ్యమా అంటూ, సాఫ్ట్‌వేర్ ఎగుమతుల్లో దేశం ముందుకు పోతుంది కాబట్టి, ఆ విభాగం మీదే కేంద్రీకరించాలని నిర్ణయించి వుండాలి. అదలా వుంచితే అడ్డగోలుగా విదేశీ కూరగాయలు, మందులు, సినిమాలు, ఏంటీబయాటిక్ మందులు, సుగంధ ద్రవ్యాల దిగుమతి మీద ఆంక్షలు తొలగించారు. కార్పొరేట్ రంగం వ్యవసాయంలో ప్రవేశించింది కాబట్టి వ్యవసాయ ఉత్పత్తుల ఎగుమతులకు కూడా ప్రాధాన్యత ఇచ్చారు.

క్లుప్తంగా చెప్పాలంటే అభివృద్ధి చెందిన దేశాలు మన ఎగుమతుల మీద డబ్ల్యు.టి.వో. నియమ నిబంధనల నుల్లంఘిస్తూ, అనేక ఆంక్షలను ప్రత్యక్షంగా, పరోక్షంగా విధిస్తున్నాయి. మన దేశంలోకి దిగుమతులతో అదే డబ్ల్యు.టి.వో.ను వినియోగించుకొని, మన మార్కెట్లను కబళిస్తున్నాయి.

పరిమాణాత్మక ఆంక్షలు 1500 వస్తువుల మీద తొలగించారనేది పాక్షిక సత్యమే. సంస్కరణలు ప్రారంభం కాక ముందు ఎనిమిది వేల వస్తువుల మీద ఆంక్షలుండేవి. 1996

నాటికి 6610కు, 96-99 మధ్య 1906కు తగ్గాయంటే, ఆంక్షల ఉపసంహరణ సంస్కరణలు ప్రారంభించిన 1991 ముందునుంచీ కొనసాగుతున్నాయని అర్థమౌతుంది. స్వయం పోషకత్వాన్ని, స్వయం సమృద్ధిని పెంచడానికి, దేశీయ పరిశ్రమకు రక్షణ కలిగించడానికి 1991 ముందు ఈ ఆంక్షలు విధించారు. కాగా, ఆంక్షలు తొలగించడమంటే కేవలం ఆ వస్తువులను ధారాళంగా దేశంలోకి అనుమతించడమే కాదు, స్వయం పోషకత్వానికి చెల్లు చీటీ వ్రాయడమే. ఏ వస్తువుల మీద ఆంక్షలు తొలగించి స్వచ్ఛగా దిగుమతి చేయడానికి అనుమతించామో, దేశంలో ఆ వస్తువులను తయారుచేసే కర్మాగారాలు మూత పడతాయి. కార్మికులు వీధిన పడతారు. దేశీయ మార్కెట్ మీదా విదేశీ సంస్థల పట్టు పెరుగుతుంది. ఒకసారి మార్కెట్ వారు చేతుల్లోకి తీసుకొన్న తర్వాత ధరలు పెంచడం ప్రారంభిస్తారు. ముఖ్యంగా చిన్న పరిశ్రమలు రెండు రకాలుగా దెబ్బ తింటాయి. 1) 98-99లో మొత్తం ఎగుమతుల్లో 35 శాతం చిన్న పరిశ్రమల ఉత్పత్తులు ఎగుమతులు దెబ్బ తిన్నాయి. 2) పోటి తట్టుకోలేక మూత పడ్డాయి. సంస్కరణలు ప్రారంభించిన మొదటి ఐదు సంవత్సరాల్లోనే దిగుమతులు రెట్టింపయ్యాయి. ఈ ధోరణి కొనసాగుతూనే వుంది. ఆంక్షలు తొలగించాం కాబట్టి, ఇవి ఇంకా పెరిగిపోతాయి. అవి పెరిగిన కొద్దీ మన పరిశ్రమలకు ఆయుర్దాయం క్షీణిస్తూంటుంది. అదే సమయంలో ఎగుమతులు లక్ష్యం చేరుకొనే సూచనలు లేవు. 2000 సంవత్సరం నాటికే 50 బిలియన్ డాలర్ల విలువగల స్థాయికి చేరుకోవాల్సి వుండగా 99-00 నాటికి 37 బిలియన్ డాలర్లు మాత్రమే సాధించింది. ఎగుమతులు, దిగుమతుల వల్ల మనకు పోయిందీ లేదు, వచ్చేదీ లేదు, అలాంటపుడు అవి పెరిగితేనేమీ, తగ్గితేనేమి అని సామాన్య, మధ్య తరగతి ప్రజలు మిన్నకుండా వుండడం ముంచు కొస్తున్న ప్రమాదాన్ని గ్రహించకపోవడమే అవుతుంది. ప్రస్తుత ధోరణుల పరిశీలన తెలియచేసేదేమంటే ఎగుమతులు తగ్గుతాయి, దిగుమతులు పెరుగుతాయి. కస్టమ్ ఆదాయం పెరుగుదల తగ్గుతుంది. విదేశీ వస్తువులు దేశీయ మార్కెట్‌ను ముంచెత్తుతాయి. ఇప్పటికే ఈ వస్తువులు, ముఖ్యంగా వినియమ వస్తువులు గ్రామసీమలకు తరలి వెళ్ళుతున్నాయి. కుంకుడు కాయల బదులు రూపాయ పెట్టి షాంపూ పాకెట్ కొంటున్నారు. స్థానిక బట్టల సబ్బుల స్థానే విదేశీ కంపెనీ సబ్బులు చోటు చేసుకొన్నాయి. గ్రామీణ ప్రజల కొనుగోలు శక్తిని గమనంలో వుంచుకొని ఈ కంపెనీలు ఒకటి, రెండు రూపాయల పాకెట్లలో సరఫరా చేస్తున్నారు. 70 శాతం మంది గ్రామాల్లో నివసిస్తున్నారు కాబట్టి, ఆ మార్కెట్ వాళ్ళ ప్రభావానికి లోనైతే, మన పరిశ్రమలకు, ముఖ్యంగా, చిన్న, చిట్టి పరిశ్రమలకు అది మరణ శాసనమే అవుతుంది. వ్యవసాయ ఉత్పత్తుల దిగుమతి అనుమతించడంతో రైతు కూలీలు ఏమవుతారో వూహించడానికే భయంగా వుంది. నష్టపోయేది ప్రజలే కాబట్టి దీన్ని ప్రతిఘటించాల్సింది ప్రజలే. ❑

## సమీక్షపై సమీక్ష

**సమీక్ష** ఏప్రిల్ 16-30 సంచికలో వ్యవసాయరంగంలోని వివిధ రకాల సమస్యలను, రుగ్మతలను సవివరంగా తెలియజేసినారు. సమస్యల యొక్క స్వభావము, పరిష్కారము తెలిసి వున్నా కూడ పాలకులు, అధికారులు సమయోజితంగా స్పందించకపోవడం నిజంగా ఈ దేశపు రైతులు చేసుకున్న దౌర్భాగ్యం. పైగా ప్రపంచీకరణ పేరుతో రైతు ప్రయోజనాలు దెబ్బతినే ప్రక్రియలను అమలు పరచుకొనచూడటం పెద్ద కంపెనీలు, పెట్టుబడిదారుల ప్రయోజనాలను కాపాడడమే పరిపాలకుల లక్ష్యంగా వుందడానికి వేరే సాక్ష్యాలు అక్కరలేదు. జన పరిరక్షణ వుద్యమాలు సాగించడం ఎంతైనా అవసరం.

వి.శ్రీహరిగారి వ్యాసం మరింత వివరణాత్మకంగా వుంటే బాగుండేది.

ఈ పత్రికలో అచ్చుతప్పులున్నాయి. మలి సంచికలో మరింత జాగ్రత్తగా తీసుకుంటారని ఆశిస్తాను.

**- సి.భాస్కర రెడ్డి,**
**నెల్లూరు**

**చందాదారుడిగా**, మొట్ట మొదటి సంచిక నుంచి ప్రజాపక్ష సమీక్ష చదువుతున్నాను. పత్రిక సరియైన తరుణంలో వెలువడింది. అనేక మంది సామాన్య పాఠకులకు విపులంగా విశేషవివరాలు అందుతన్నై. అయితే అచ్చుతప్పులు కొంచెం ఎక్కువగా ఉంటున్నై.

ముఖ్యంగా ఆంధ్రజ్యోతి వార్త దినపత్రికలో వచ్చే విశ్లేషణాత్మక వ్యాసాలకన్నా దీటుగా ఉండేట్టు చూసుకోవలెనని నా అభిప్రాయం.

**- పురాణం రాంప్రసాద్,**
**హైదరాబాద్**

# ఇవాళ్టి అవసరం 'స్వదేశీ' నినాదం

- డి. పాపారావు

**అమెరికా, బ్రిటన్‌లు** ఇరాక్‌పై దరిదాపు ఆధిపత్యాన్ని సంపాదించాయి. అయితే ప్రపంచంలోని అత్యధిక శాతం ప్రజానీకం ఈ దాడిని వ్యతిరేకించారు. ఈ వ్యతిరేకత పలుదేశాలలో శాంతి ప్రదర్శనల రూపంలో సాగింది. అమెరికాలో కూడా ఇటువంటి భారీ ప్రదర్శనలు జరిగాయి. బ్రిటన్ అయితే ఈ యుద్ధ వ్యతిరేకత ఏకాఏకిన పాలక పక్షాన్నే చుట్టుముట్టింది. పలువురు బ్రిటిషు మంత్రులు, పాలక పార్టీ పార్లమెంటు సభ్యులు ఈ దురాక్రమణకు తమ వ్యతిరేకతను బహిరంగంగానే ప్రకటించారు. దీనంతటితోపాటుగా అమెరికాతో సహా పలు దేశాల మేధావులు తమ యుద్ధ వ్యతిరేకతను నిర్మొహమాటంగా వెల్లడించారు. ఆస్కార్ అవార్డు గ్రహీతలు సైతం అవార్డులను అందుకుంటూ అదే వేదికపైనుంచి అమెరికా పాలకులను దుయ్యబట్టారు.

అయితే మొత్తం మీద అమెరికా, బ్రిటన్ సైన్యాలు ఇరాక్‌ను కబళించగలిగాయి. దీనితో ప్రపంచ శాంతి కాముక ప్రజానీకం కొంత మేరకు నిరాశకు లోనయ్యారు. అయితే వారందరిలోనూ అమెరికా పట్ల వ్యతిరేకత లోలోపల అట్టుడుకుతోంది. దీనికి ఒక తార్కాణమే గల్ఫ్‌దేశాలు మొదలు కొని భారత దేశంలోని పలు రాష్ట్రాలతో సహా అమెరికా, బ్రిటన్ సరుకుల బహిష్కరణను గురించి వస్తున్న వార్తలు.

ప్రస్తుతం అమెరికా సైనికంగా గెలిచింది. అయితే అది ప్రపంచ ప్రజాభీష్టాన్ని కాలరాసి నైతికంగా ఓడిపోయింది. అమెరికా తాలూకు ఈ నైతిక పరాజయం, నిర్లజ్జ అయిన దురాక్రమంలు కలగలిపి వివిధ దేశాలలో అది ఒక "స్వదేశీ" ఉద్యమంగా రూపుదిద్దుకోవాలి. ఈ ఉద్యమాన్ని ఆపగలిగేందుకు అమెరికా, బ్రిటన్‌ల ఆయుధ సంపత్తి "సరిపోదు". మౌన మహా సముద్రంలా విస్తరిస్తోన్న "స్వదేశీ" కెరటాలు అనతికాలంలోనే అమెరికా, బ్రిటన్‌లకు, వాటి ఆర్థిక వ్యవస్థలకు భరించలేనివిగా మారగలవనేది నిస్సందేహం. ఎక్కువ భాగం శాంతియుతంగా నడుస్తున్న ఈ ఉద్యమాన్ని ఆపేందుకు పీనల్‌కోడ్‌లు, వాటి నిబంధనలు పనికిరావు. ఎందుచేతనంటే ఈ ఉద్యమం ఉద్యమకారులు, వారికి సానుభూతి తెలిపే మెజారిటీ ప్రజల నూతన "సత్యాగ్రహం" రూపం. నేను ఫలానా సరుకును కొనను అని నిర్ణయించుకున్న వ్యక్తిని ఎటువంటి నేర పరిధిలోకి తీసుకు రాలేరు. మన ప్రజాతంత్ర వ్యవస్థ పరిమితులలో ఎటువంటి ఉద్రిక్తత లేకుండా తేలికగా ఇమిడి పోగల ఉద్యమం ఇది.

అయితే మన దేశంలో మొదటగా నినాదం రూపంలో "స్వదేశీ" ని ముందుకు తెచ్చిన సంస్థ ఆర్.ఎస్.ఎస్., కానీ విదేశీ సరుకుల బహిష్కరణ ప్రచారం ఎక్కువగానే సాగుతున్నా ఈ విషయంలో ఆర్.ఎస్.ఎస్. గొంతు విప్పకపోవడం మనం గమనించాలి. దీనికి ప్రధాన కారణం ఒకటే. నేటి మన పాలక పక్షం బి.జె.పి. దానికి వెన్ను దన్నుగా నిలుస్తున్న సంస్థలు సంఘ్ పరివార్‌కు చెందినవి కాగా నేటి మన బి.జె.పి. ప్రభుత్వం అమెరికా అగ్రదేశపు తోలు బొమ్మలాటలో కీలుబొమ్మగా మారిపోయింది. ఇది ఆ పార్టీ వర్గ పునాది అయిన మధ్యతరగతి, వ్యాపారుల దృష్ట్యా అనివార్యం. అంతకు మించి ప్రపంచీకరణ నేపథ్యంలో పలు ఇతర దేశాలు కూడా తమ స్వయం-నిర్ణయాధికారాన్ని కోల్పోయాయి అనేది నిజం. ఆయా పెట్టుబడి దారీ దేశాలు (ముఖ్యంగా మూడవ ప్రపంచంలో) తమ పాలక వర్గాల, పార్టీల సంకుచిత ప్రయోజనాలకు లోబడి పోవడం వలన ఇదంతా జరుగుతోంది. నేటి యుగంలో పెట్టుబడి దారీ ప్రభుత్వాలు వున్న మూడవ ప్రపంచ దేశాలలో విదేశీ ప్రయోజనాలకు కుదువపెట్టబడే పాలకులు వుండడం బహుసహజం. మన దేశ పాలక వర్గపు ఈ సంక్షోభం నుంచి పలు కుంభ కోణాలు వెలుగు చూస్తున్నాయి. దళారీలుగా మారిన కొందరు పాలక వర్గ రాజకీయ నాయకులు రోజుకొకరుగా కుంభకోణాల్లో ఇరుక్కు పోతున్నారు. బంకర్లనుంచి బంకుల దాగా జరిగిన పలు కుంభకోణాలే ఈ పరిస్థితికి తార్కాణం.

కాగా "స్వదేశీ" నినాదానికి తిలోదకాలు ఇచ్చిన పాలకవర్గం, ఆ నినాదాన్ని వెబ్ సైట్లకే పరిమితం చేసిన ఆర్.ఎస్.ఎస్.లకు ఇక మిగిలింది ఆవేశాలను రెచ్చగొట్టగల మతోన్మాదమే. అందుచేతనే బి.జె.పి. నాయకత్వం "హిందుత్వ"

నినాదాన్ని ప్రచారం చేస్తోంది. దానికోసమై గుజరాత్ తరహా ప్రయోగం చేసింది. వివిధ రాష్ట్రాలలో త్రిశూలాలు పంచుకుంటూ 'పొడుచుకుంటూ చావండ'ని ప్రజల మధ్య చిచ్చుపెడుతూ వి.హెచ్.పి. నేత తోగ్గాడియా ప్రతి రాష్ట్రమూ తిరుగుతున్నారు.

అయితే బి.జె.పి., సంఘ్ పరివార్‌లు తమ తరహా "హిందుత్వం"ను సాధించడం అంత సులభమేమీకాదు. హిట్లర్ నాయకత్వంలోని నాజీ ప్రభుత్వం కూడా తన ఆధిపత్యాన్ని జర్మన్ ప్రజలపై నిరూపించుకునేందుకు ముందుగా ఆర్థిక సంక్షోభంలో కూరుకున్న తన దేశ ఆర్థిక స్థితిని చక్క దిద్దింది. తద్వారా మాత్రమే నాజీలు జర్మనీపై ఉక్కు పిడికిలిని బిగించగలిగారు. ఈ నేపథ్యంలోనే బెర్థేల్ట్ బ్రెచ్ట్ అనే జర్మన్ కవి చెప్పిన "ఈటింగ్ కమ్స్ ఫస్ట్, మొరాలిటీ నెక్స్ట్" అనే మాటలను గుర్తుచేసుకోవచ్చు. కాగా కేంద్రంలోని బి.జె.పి. ప్రభుత్వం, దానికి వెన్ను దన్నుగా ఉన్న సంఘ్ పరివార్ సంస్థలు ఈ నినాదాన్ని తిరగేసి రాస్తున్నాయి. వాళ్ళ దృష్టిలో "మొరాలిటీ " అయిన హిందుత్వను ఉగ్రంగా ప్రచారంలో పెడుతూనే, మరో ప్రక్క దానికి భౌతిక పునాదిగా వుండగల "స్వదేశీ" నినాదానికి నీళ్ళొదులు తున్నాయి.

వామపక్ష, ప్రజాతంత్ర, సంస్థల వంటివి ఈ రెండు నినాదాల మధ్య ఏర్పడిన వైరుధ్యాన్ని తమకు అనుకూలంగా మలుచుకోవాలని వివిధ పత్రికలలో నేను గతంలో వ్యాసాలు రాసాను. మన ప్రభుత్వం ఎక్కువగా అమలు జరుపుతున్న సరళీకరణ, ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ విధానాలు మనదేశ సామాన్యుడి నడ్డిని విరిచేస్తున్నాయి. ఆర్థికంగా సామాన్యుడి స్థితి చితికి పోతోంది. ఈ నేపథ్యంలో వామ పక్ష శక్తులు ఆచరణాత్మకమైన స్వదేశ విధానానికి పోరాటాలు జరపాలి. తద్వారా స్థానిక స్థాయిలో ప్రజాపోరాటాలను నిర్మించాలి.

ఈ స్థానిక పోరాటాలు విస్తృతి పెరిగి మొత్తం మన దేశాన్నే చుట్టుముట్టేయగలవు. అంటే ఒకే దెబ్బకు రెండు పిట్టలు రాలుతాయి. ఒక ప్రక్క బి.జె.పి., పరివార్ సంస్థల "హిందుత్వం"కు విరుగుడు లభిస్తుంది. మరో ప్రక్క మన దేశ ఆర్థిక దుస్థితికి ప్రధాన కారణమైన సామ్రాజ్యవాద దోపిడీకి అడ్డుకట్ట పడుతుంది. బహుశా అనతికాలంలోనే ప్రపంచ వ్యాప్తంగా ముఖ్యంగా మూడవ ప్రపంచ దేశాల అన్నిటి బాటా ఇదే అవుతుంది.

కాగా పలు విదేశీ సరుకులు పేరుకు విదేశాలవేనైనా వాస్తవానికి వాటి ఉత్పత్తి మనదేశంలోనే జరుగుతున్నది కదా అని కొందరు సందేహపడవచ్చు. అంటే స్వదేశంలో సరుకును ఉత్పత్తి చేసే విదేశీ పరిశ్రమలు మూత పడితే మన కార్మికులకు, యువజనులకీ ఉపాధి కరువు అవుతుంది కదా' అని వారు వాదించవచ్చు. వాస్తవానికి ఈ విదేశీ బహుళ జాతి సంస్థలు, మన దేశీయ పరిశ్రమలనే మింగేసి ఇక్కడ తన స్థానాలను పదిలపరుచుకున్న సంగతిని మనం మరువరాదు. ఆధునాతన సాంకేతిక పరిజ్ఞానం ముసుగులో ఈ బహుళ జాతి సంస్థలు మనదేశంలో నిరుద్యోగం పెరుగుదలకు చాలామేరకు కారణం అయ్యాయి. కాబట్టి విదేశీ బహుళజాతి సంస్థల పునాదులను ప్రజా ఉద్యమం గనుక పెకిలించగలిగితే, కోకొల్లలుగా స్వదేశీ పరిశ్రమలు నిలదొక్కుకుని అభివృద్ధి చెందుతాయి. మరలా మరిన్ని ఉపాధి అవకాశాలు మన కార్మికులకు, యువజనులకు లభిస్తాయి. దీనికి చిన్న తార్కాణమే ఈ స్వదేశీ ఉద్యమం తొలిదశలోనే బెంగాల్‌కు చెందిన కొందరు విద్యార్థులు కోకోకోలాకు ప్రత్యామ్నాయంగా మరో (స్వదేశీ) శీతల పానీయాన్ని తయారు చేయగలిగారు.

కాబట్టి విదేశీ వస్తు బహిష్కరణ మన దేశీయ ఉత్పత్తి దారులకు మానసిక బలాన్ని చేకూర్చి పెట్టగలదు. పరిశోధనా అభివృద్ధికి మరిన్ని అవకాశాలు ఏర్పడతాయి.

అయితే నేడు ''ప్రపంచీకరణ'' యుగంగా చెప్పబడుతున్న దానిలో ప్రపంచం మొత్తం ఒకే మార్కెట్‌గా మారింది. దానితోపాటుగా ప్రతి దేశీ మార్కెట్‌లోనూ అనివార్యంగా విదేశీ సరుకులు వుంటున్నాయి. కాబట్టి మనం స్వదేశీ నినాదాన్ని తెగిందాకా లాగకూడదు. ప్రత్యామ్నాయాలు అందుబాటులో వున్న ప్రతి సందర్భంలోనూ మాత్రమే స్వదేశీ సరుకులకు ప్రోత్సాహాన్ని కల్పించాలి. మరిన్ని విదేశీ సరుకులకు ప్రత్యామ్నాయాలను సృష్టించే దిశగా కృషి, పరిశోధనా జరగాలి.

ఈ కృషి సామ్రాజ్యవాదుల ఆర్థిక పీఠాలను కుదిపివేయగలదు. మరిన్ని ఇరాక్‌లు వారి బారిన పడకుండా ఇది సామ్రాజ్యవాదులకు హెచ్చరికగా వుండగలదు. కాబట్టి నేటి స్వదేశీ నినాదం పలు పార్శ్వాలు కలది: 1) దేశాన్ని విదేశాలకు కుదువపెడుతోన్న పాలక పక్షాల ద్రోహాన్ని ఇది ఎండగట్టగలదు; 2) మన దేశ సార్వభౌమాధికారాన్ని కాపాడుకునేదిశగా పెద్ద ముందడుగు కాగలదు; 3) సామ్రాజ్య వాదుల యుద్ధ భీభత్సాలను నిలువరించగలదు; 4) స్వదేశీ ఉత్పత్తి దారులకు బలాన్ని ఇవ్వగలదు. ఇలా ఎన్నైనా చెప్పవచ్చు. ❐

# ఇక మిగిలిన ఆస్తి విద్యే

- వి.వంశధార

**రాష్ట్ర ప్రభుత్వం** ప్రజలకు పారదర్శకమైన సమాచారాన్ని అందించాలనే సదుద్దేశ్యంతో బుద్ధపూర్ణిమ రోడ్డు చివర, హుస్సేన్‌సాగర్ తీరాన 'మీకోసం' అనే ఒక డిజిటల్ డిస్‌ప్లే సౌకర్యం ఏర్పాటు చేసింది. అక్కడ ఏ సమాచారాన్ని ప్రదర్శిస్తారు? ప్రజలకు కావలసిన సమాచారం ప్రదర్శిస్తారా? ప్రభుత్వం చెప్పదలచుకున్న సమాచారం ప్రదర్శిస్తారా? అసలు అక్కడికి వచ్చే 'ప్రజలు' ఎవరు? ఆ వచ్చే ప్రజల్లో ఆ ఇంగ్లీషు సమాచారాన్ని చదివి అర్థం చేసుకోగల వాళ్ళెందరు? ఈ 'మీకోసం' అనే వివాదస్పదమైన పదబంధంలోని 'మీ'లో మనం వున్నామా లేదా? లాంటి ప్రశ్నలు వేసుకోకముందే ఆ సమాచారం మధ్యలో ప్రభుత్వం ప్రకటించిన ఒక సుభాషితం గురించి మాట్లాడుకుందాం. 'మీకున్న ఒకే ఒక్క ఆస్తి విద్య. దాన్ని అభివృద్ధి చేసుకుందాం' అని ఆ సుభాషితం అంటుంది. ఈ రాష్ట్ర ప్రజల ఆస్తులన్నింటినీ ఒకటొక్కటిగా బహుళజాతి సంస్థలకు, స్వదేశీ, విదేశీ సంపన్నులకు అమ్మివేస్తున్న ప్రభుత్వం మిగిలిన ఆస్తి విద్యే అవడం చాలా సముచితంగా వుంది. రియాలిటీ ఆస్తులు కరిగిపోతున్నప్పుడు వర్చువల్ రియాలిటీ ఆస్తుల గురించి మాట్లాడక తప్పదు!

దేశంలో మరే రాష్ట్రానికీ లేనంత పొడవైన సముద్రతీరం వున్న మనం ఆ తీరాన్ని ప్రైవేటు ఓడరేవులకు, ప్రైవేటు బీచ్ రిసార్ట్‌లకు అప్పగిస్తున్నాం. రెండున్నర కోట్ల ఎకరాల సారవంతమైన నికర సాగుభూమి వున్న మనం దాన్ని పేదరైతుల నుంచి లాగేసుకొని కార్పొరేట్, కాంట్రాక్టు వ్యవసాయం పేరిట విశాల భూక్షేత్రాల కామందులకు అప్పజెవుతున్నాం. జలసంపదను, అటవీ సంపదను, ఖనిజ సంపదను ఇంకా ఇంకా ప్రైవేటీకరిస్తూ యాజమాన్యాన్ని ఏడేడు సముద్రాల అవతలి దొరలకు బదలాయిస్తున్నాం. మన నెత్తుటిని చెమటగా మార్చి నిర్మించిన వందల కోట్ల రూపాయల ఆస్తులు విద్యుచ్ఛక్తి బోర్డు నుంచి, గనుల నుంచి ప్రభుత్వ రంగ సంస్థల దాకా - ఉమ్మడి యాజమాన్యం నుంచి వ్యక్తిగత యాజమాన్యంలోకి ప్రవహింపజేస్తున్నాం.

కనబడే ఆస్తులన్నీ ఇట్లా కరిగిపోతున్నప్పుడు, మరొకరి ఖాతాలో పెరిగిపోతున్నప్పుడు, కనబడని ఆస్తుల గురించి మాట్లాడడమే ఉచితం. కానీ విద్యను ఆస్తిగా చూడవచ్చునా అనేది ప్రశ్న.

'విద్య నిగూఢ గుప్తమగు విత్తము' అనీ, 'విద్యకు సాటి ధనంబు లేదిలన్' అనీ భర్తృహరిని అనువదిస్తూ ఏనుగు లక్ష్మణకవి అన్నమాట నిజమేగాని ఈ జాతి విద్యను అంతగా అణాపైసల లెక్కలలోకి కుదించి ఎప్పుడూ చేడలేదు. 'చదవని వాడజ్ఞుండగు, చదివిన సదసద్వివేక చతురత గల్గున్' అని బమ్మెర పోతన ప్రహ్లాదుడి నోట చెప్పించినట్టు, విద్యకు ఉదాత్తమైన నిర్వచనాలు ఇచ్చుకున్న జాతి మనది.

విద్యను ఒక శిశువును వ్యక్తిగా తీర్చిదిద్దే సాధనంగా, మనిషిలో సృజనాత్మక వికాసానికి అవకాశమిచ్చేదిగా, మనిషికి తనపట్ల, పరిసరాల పట్ల అవగాహన పెంచేదిగా, మంచిచెడుల విచక్షణ తెలియజేసేదిగా చూడడమే మనకు తెలుసు.

ఉద్యోగాలకూ, డిగ్రీలకూ ముడిపెట్టడం ఎంతో కొంత విద్యను ఉద్యోగ సాధనంగా, ఆస్తి సంపాదనా సాధనంగా చూసే ధోరణి కూడా ప్రబలిందేమోగాని దానికదిగా విద్యను ఆస్తిగా చూడడం మనకింకా అలవడలేదు. ఒకవేళ అలవడినా దానికి కొలబద్దలు లేవు గనుక సాధ్యమూ కాదు.

కానీ ఇవాళ ఏలినవారికి సమాజంలోని ప్రతి అంశమూ దాని ఉదాత్త లక్ష్యాలను వదులుకొని లాభనష్టాల లెక్కలలోకి, అణాపైసల లెక్కలలోకి దిగజార్చడం (వాళ్ళ భాషలో ఎగబాకడం, 'అభివృద్ధి' చెందడం) అవసరం. అందుకే విద్యకు ఇన్నాళ్ళుగా ఇచ్చుకుంటున్న ఉదాత్త నిర్వచనాలను బలవంతంగా చించేసి, వాటి స్థానంలో ఈ కొత్త నిర్వచనాలివ్వాలి. నిజానికి రాష్ట్రాన్ని స్వర్ణాంధ్రప్రదేశ్‌గా మార్చడానికి విజన్ 2020 విద్యను మరింత చౌకబారుగా నిర్వచించింది. విద్యంటే మార్కెట్లో అమ్ముకోగల నైపుణ్యం కల్పించడమే అని ఆ మెకన్సీ అండ్ కంపెనీ రాసిన 'దార్శనిక' పత్రం ప్రకటించింది.

అంటే ఇవాళ మార్కెట్లో కంప్యూటర్లకు ప్రాధాన్యత వుంటే ఆ విద్యే అమ్ముకోగలం గనుక ఆ విద్యే నేర్చుకోవాలి. రేపు కంప్యూటర్ల ప్రాధాన్యత తగ్గిపోయి ఆవు పేడకు ప్రాధాన్యత వస్తే ఆవు పేడను ఎట్లా ఉత్పత్తి చేయాలో నేర్చుకోవాలి. విష్ణువును ద్వేషించడం నేర్చుకోవడమే విద్య అని నిర్వచించిన హిరణ్యకశ్యపుడు కూడా విద్యకు ఇంత తాత్కాలికమైన, నీచమైన అర్థాన్ని ఊహించి వుండడు. ఆస్తికి సంబంధించిన విషయాలలో ఉచ్ఛనీచాల విచక్షణకు తావులేదు గనుక విద్యను ఇట్లా నిర్వచించడంతోపాటు దాన్ని ఆస్తి అనేస్తే సరిపోతుంది.

విద్యను ఇట్లా నిర్వచించినప్పుడు సహజంగానే సమాజం గురించి చెప్పే సామాజిక శాస్త్రాలు అక్కర్లేదనిపిస్తుంది. ఈ సమాజానికి ఒక చరిత్ర వుందని, ఆ చరిత్ర ఒక గతం నుంచి ఈ వర్తమానంలోకి ప్రవహించిందని, రేపాక భవిష్యత్తులోకి వికసిస్తుందని అవగాహన విద్యలో భాగం కాదనిపిస్తుంది. కనుక చరిత్ర పాఠాలు అక్కర్లేదనిపిస్తుంది.

ఆస్తిలో తారతమ్యాలను, అసమానతలను, అగాధాలను అంగీకరించి, ఏమీ జరగనట్టే సజావుగా కొనసాగుతున్నట్టే, విద్యను ఆస్తిగా గుర్తిస్తే విద్యలో అసమానతల పట్ల కూడా కళ్ళు మూసుకుని వుండవచ్చు. ఈ రాష్ట్రంలో నూటికి 56 మంది తెలుగు అక్షరాలు రావని, తెలుగు చదవనేర్చిన 45 మందిలో పదిమంది కూడా ఇంగ్లీషు చదవలేరని తెలిసినా, దాన్నంతా వర్చువల్ రియాలిటీలోకి నెట్టి, ఇంగ్లీషులో 'మీకోసం' బోర్డులు పెట్టవచ్చు. పదిమందికి కూడా అర్థంకాని కంప్యూటర్ల భాష మాట్లాడవచ్చు. విద్య చైతన్య సాధనమనే, ప్రజాస్వామ్యానికీ, సమానత్వానికీ విద్య ఒక షరతనే మౌలిక విషయాల జోలికి పోకుండా విద్యను ఆస్తిగా ప్రకటించి పబ్బం గడుపుకోవచ్చు. ఈ శబ్దక్రీడ ఎవరికోసం? □

***(ఆంధ్రా పొలిటిక్స్ డాట్ కామ్, ఏప్రిల్, 2000)***

## సవరణ

**(మన ఆర్థిక వ్యవస్థపై అమెరికా దురాక్రమణ ప్రభావం' శీర్షికన ప్రచురించిన వ్యాసంలో 11వ పేజీలో మిగిలిన భాగాన్ని 24 పేజీలో' అని పేర్కొని, పొరపాటున 24 పేజీలో ఆ భాగాన్ని అందించలేకపోయాం. ఇప్పుడు ఆ భాగాన్ని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం. గమనించగలరు - సంపాదకులు)**

-అమెరికా ఇపుడు ఆ దేశ ప్రజలకు కనీసం తిండిపెట్టాల్సిన బాధ్యత వుంటుంది కాబట్టి, అమెరికా నుంచే ఆహార ధాన్యాలను ఎగుమతి చేయవచ్చు. అక్కడి బహుళజాతి సంస్థల, రైతులాబీలు చేతులు ముడుచుక కూర్చోవు. ఇదివరకే మిలియన్ల డాలర్ల సబ్సిడీని అక్కడ రైతులకు అమెరికా ముట్టచెబుతుంది. దాని ప్రభావంగా ఏర్పడే ధర విషయంలో మనదేశం పోటీకి నిలబడి ఎగుమతులను కొనసాగించగలదా? అమెరికా ఇరాక్‌లో ప్రవేశించిన తరువాత టెర్రరిస్టులు చూస్తూ కూర్చోరు కదా. ఆ పరిస్థితిని అమెరికా మిలిటరీ పాలకులు ఎదుర్కోవాల్సి వుంటుంది. యుద్ధం ముగియ వచ్చుకాని యుద్ధ వాతావరణం కాదు. అందుచేత తమ చార్జీలను రెట్టింపుకు పెంచిన ఆయిల్ టాంకర్ ఓడలు ఛార్జీలను తగ్గిస్తాయో, లేదో చూడాల్సి వుంది. ఛార్జీలు తగ్గించకపోతే, మన ఆహార ధాన్యాల ఎగుమతులు ఖరీదు ఇంకా పెరుగుతుంది. అలాగే మనదేశం ప్రతి సంవత్సరం75 మిలియన్ టన్నుల చమురును దిగుమతి చేసుకొంటుంది. కాగా, ఈ ధర కూడా పెరుగుతుంది. యుద్ధం పేరుతో కొన్ని వందల. కంపెనీలు సర్ చార్జీలు విధించాయి.

రూపాయ విలువ తగ్గి డాలర్ 50 రూపాయలు పలకవచ్చునని ఆర్థిక నిపుణులు అంచనావేస్తున్నారు. సిఐఐ కూడా ఈ అభిప్రాయాన్ని వెలిబుచ్చింది. మనకు పాకిస్తాన్‌కు మధ్య యుద్ధ పరిస్థితి వుండనే వుంది. ఆ పాపభాండం ఎపుడు బద్దలవుతుందో ఎవరికీ తెలియదు. అమెరికా పాకిస్తాన్‌ను వెనకేసుకొస్తున్న విషయం ఈ సందర్భంలో మరచిపోరాదు. చెప్పొచ్చేదేమంటే ఇరాక్, అమెరికా యుద్ధం ముగిసిందని మురిసిపోవడానికి వీలులేదు. ఆభారాలు మనం మొయ్యాల్సి వుంటుంది. ఇది మన ఆర్థిక పరిస్థితిని మరింత ఒడిదుడుకులకు లోను చేస్తుంది. కరువు పరిస్థితికి ఈ పరిణామం తోడై మన స్థూల జాతీయాదాయాన్ని, తలసరి ఆదాయాన్ని తగ్గిస్తుంది. ద్రవ్యోల్బణం ఇప్పటికే ఆరు శాతానికి పెరిగింది.

అయితే అమెరికా ఆర్థిక సామ్రాజ్యవాద దాష్టీకం ఇలా కొనసాగాల్సిందేనా అన్న ప్రశ్నకు జవాబు చెప్పాల్సింది ప్రజలు. ప్రపంచ చరిత్రలో ఎన్నడూ కనీవిని ఎరుగని రీతిలో కోట్లాది ప్రజలు అన్ని దేశాల్లో వీధుల్లోకి వచ్చి తమ యుద్ధ వ్యతిరేకతను ప్రదర్శించారు. కాని అది అమెరికా యుద్ధోన్మాదాన్ని నిలువరించలేకపోయింది. ఐక్యరాజ్య సమితిని కూడా విస్మరించిందంటే అది పార్లమెంటరీ ప్రజాస్వామ్యం మీద.,... తిరుగులేని దెబ్బ. టెర్రరిజాన్ని నిర్మూలిస్తానని తానే టెర్రరిస్టుగా ప్రవర్తించింది అమెరికా పాలకవర్గం. ఇటువంటి ప్రవర్తన టెర్రరిజం విస్తరణకే దారితీస్తుంది. కంటికి కన్ను, పంటికి పన్ను సిద్ధాంతాన్ని నమ్మేవారికి ఊతం ఇస్తుంది. పార్లమెంటరి ప్రజాస్వామ్యం మీద నమ్మకం మరింత సడలి పోతుంది. అందుకు అమెరికా పాలకులే బాధ్యత వహించాలి. □

# గౌరవనీయులైన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రికి మరియు సిపిఐ (యంఎల్) పీపుల్స్‌వార్ పార్టీ కార్యదర్శికి పీస్ ఇనీషియేటివ్ కమిటీ 'బహిరంగ విజ్ఞప్తి' పేరుతో విడుదల చేసిన లేఖను యధాతధ ప్రచురణ.

**ఆంధ్రప్రదేశ్‌లో ప్రజలకు** శాంతిభద్రతలను సమకూర్చడానికి ప్రతిపాదించిన 'శాంతిచర్చల' ప్రక్రియను వెంటనే ప్రారంభించవలసిందిగా, అప్పటివరకు ప్రజలపట్ల ఎలాంటి హింసాత్మక చర్యలకు పాల్పడకుండా సంయమనం పాటించవలసిందిగా మీ ఉభయులకు ఎంతో తీవ్రమైన ఆకాంక్షతో, హృదయపూర్వకమైన విజ్ఞప్తి చేస్తూ ఈ బహిరంగ లేఖ రాస్తున్నాము. ఆ దిశగా చర్చలు, సంప్రదింపులు, ప్రారంభించవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము.

ఆంధ్రప్రదేశ్ ప్రజానీకాన్ని అత్యంత ఆందోళనకు గురిచేస్తున్న ఈ సమస్యను మీ దృష్టికి తెస్తూ గతంలో కూడా ఇలాంటి విజ్ఞప్తులు మేము చేశాము. కారణాలేవైనప్పటికీ అటువంటి చర్చలు జరగలేదు. మీ ఇరువురికి అటువంటి చర్చలపట్ల శ్రద్ధ లేదని మేము అనడంలేదు. శాంతి సాధనకోసం చర్చల ప్రాధాన్యాన్ని మీరు గుర్తించడం లేదని కూడా మేము భావించలేదు. కాని చర్చలు ప్రారంభించడానికి ఆలస్యం జరిగిన కొద్ది సమయం గడిచిపోవడం మాత్రమే కాకుండా పరిస్థితులు మరింతగా క్షీణిస్తూ ప్రజలు నిస్పృహకు గురై తమ సమస్యలకు పరిష్కారాలు కనిపించక ఆందోళన చెందుతున్నారనేది మాత్రమే మమ్ములను తీవ్రంగా కలవరపరుస్తోంది.

ప్రపంచంలోని అన్ని దేశాల నాయకులు అంతరంగికంగాను, బయటనుంచి తమ తమ దేశాలు ఎదుర్కొంటున్న సమస్యలకు పరిష్కారాలు 'చర్చల' ద్వారా మాత్రమే సాధ్యమన్న విషయాన్ని గుర్తిస్తున్నారు. బహుశ, ఈ విషయంలో జార్జి బుష్, టోనీ బ్లెయిర్‌లు చరిత్రలో అపవాదులుగా మిగిలిపోకతప్పదు. గత మూడు రోజుల క్రితం జమ్మూ-కాశ్మీరులో పర్యటించిన ప్రస్తుత భారత ప్రధాని అటల్‌బిహారీ వాజ్‌పేయిగారు జమ్మూ-కాశ్మీరు సమస్యకు 'తుపాకి' ద్వారా పరిష్కారం కనుగొనడం సాధ్యం కాదని ప్రకటించి, పాకిస్తాన్ అధ్యక్షుణ్ణి మరొకమారు చర్చలకు ఆహ్వానించిన విషయం దీనికొక తాజా ఉదాహరణ మాత్రమే. గతంలో జరిగిన రెండు విడతల చర్చలు యుద్ధంతోను, పరస్పర ఆరోపణలతోను ముగిసినప్పటికి 'చర్చల' ఆవశ్యకతను గుర్తించక తప్పలేదు. ఆంధ్రప్రదేశ్‌లోని పరిస్థితులు జమ్మూ-కాశ్మీర్ కన్నా అధ్వాన్నంగా వున్నాయని మేము అనుకోవడం లేదు. ఈ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి దృష్టికి నాగాలాండ్ సమస్య పరిష్కారం విషయంలో నాగా నాయకులతో సంప్రదింపులు జరపడానికి భారతదేశ ప్రధానులు ఆయా కాలాల్లో ఎన్ని ప్రయత్నాలు చేశారో, ఒక శాశ్వత పరిష్కారం కోసం ఎన్ని మార్గాలు అన్వేషించారో ఈ సందర్భంగా గుర్తు చేయదలచుకున్నాం. భారత ప్రభుత్వం నాగా తిరుగుబాటుదారులకు 1982 నుండి సంప్రదింపులకోసం పలుమార్లు ఆహ్వానాలు పలుకుతూ విజ్ఞప్తి చేయడం జరిగింది. 1995 ఫిబ్రవరిలో పారిస్‌లో అప్పటి భారత ప్రధాని పి.వి.నరసింహారావు తన ప్రిన్సిపల్ సెక్రటరీ ఎ.ఎన్. వర్మతో కలిసి నేషనల్ సోషలిస్ట్ కౌన్సిల్ ఆఫ్ నాగాలిమ్ - ఇసాక్ మరియు మొయెవెన్ (ఎన్ఎన్‌సిఎన్-ఐఎమ్)తో సంప్రదింపులు ప్రారంభించారు. 1997 మార్చి 4న అప్పటి ప్రధాని హెచ్.డి.దేవేగౌడ్ చర్చలు ప్రారంభమైనాయని లోక్‌సభలో ప్రకటించారు. ఆ చర్చల ఫలితంగా 1997 జులై 24న ఐ.కె. గుజ్రాల్ నాయకత్వంలోని కేంద్ర ప్రభుత్వం కాల్పుల విరమణ ప్రకటించింది. 1997 ఆగస్టు 1 నుండి మూడు నెలల పాటు (మొదటి దఫాగా) కాల్పుల విరమణ అమలులోకి వచ్చింది. ఈ కాల్పుల విరమణ ఒప్పందంలో నాలుగు అంశాలనుంచి మనం గ్రహించవలసిన ఉపయుక్త అంశం ఎంతో ఉంది.

1. 1997 ఆగస్టు 1 నుంచి 3 నెలల పాటు మొదటి విడతగా ఇరువైపుల సంపూర్ణ సంఘర్షణల విరమణ (సీజ్‌ఫైర్) జరుగుతుంది.
2. శాంతి చర్చలు ఎలాంటి ముందస్తు షరతులు లేకుండా ప్రారంభమౌతాయి.
3. శాంతి చర్చలు అత్యున్నత స్థాయిలో ప్రధాన మంత్రితో జరుగుతాయి.

4. శాంతి చర్చలు తటస్థ దేశంలో జరుగుతాయి.

ఆసక్తిదాయకమైన విషయమేమిటంటే, ఎన్నో సంస్థలు ఈ కాల్పుల విరమణ కాలాన్ని పొడిగించాలని కోరాయి. ఈ కాల్పుల విరమణ ఇప్పటికీ అమలవుతోంది. 1998 ఫిబ్రవరి 16న ప్రధాని అటల్‌బిహారీ వాజ్‌పేయి తిరుగుబాటుదారులతో మరో దఫా చర్చలు జరపడానికి కేంద్ర ప్రభుత్వం సిద్ధంగా ఉందని ప్రకటించటమే కాకుండా ఆ చర్చలను ప్రారంభించి, ఆ కృషిని ఇంకా కొనసాగిస్తున్నారు.

ఈ చర్చల ప్రక్రియలో ముఖ్యంగా గమనించాల్సింది జమ్ము-కాశ్మీరులోగాని, నాగాలాండ్‌లోగాని ప్రభుత్వాలు సాయుధ తిరుగుబాటు బృందాలతో శాంతి చర్చల ప్రారంభంకోసం వారు ఆయుధాలు వదలాల్సి ఉంటుందని పట్టుపట్టలేదు. శ్రీలంకలో కూడ అదే జరిగింది. శ్రీలంక ప్రభుత్వం సంప్రదింపులు ప్రారంభించి, కొనసాగించడమే కాక ఒక మధ్యంతర అవగాహనను కూడ కుదుర్చుకోవడం జరిగింది. చర్చల ఆరంభంలోగాని, మధ్యనగాని శ్రీలంక ప్రభుత్వం ఎల్.టి.టి.ఇ. ఆయుధాలు వదలిపెట్టాలి అన్న విషయాన్ని ఒక షరతుగా విధించలేదు. ఆంధ్రప్రదేశ్‌లో పరిస్థితులు శ్రీలంకకన్నా భయానకంగా ఉన్నాయని మేము అనుకోవడం లేదు. దీని అర్థం ఇటు మన దేశంలోగాని, అటు బయట దేశాల్లో గాని జరుగుతున్న చర్చల ప్రక్రియలో ఆయా ప్రభుత్వాలు చేసిన ప్రయత్నాలు ఆయా రాజ్యాంగాలకు వ్యతిరేకంగానో, రాజ్యాంగ పరిధుల్ని అతిక్రమించో జరుగుతున్నవి కావు. ఇందులో రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధమైన అంశం ఏదీ లేదు.

విచ్చలవిడిగా ఆయుధాలు ప్రయోగించి ఉభయులు తామనుకున్న ఫలితాలను పొందగలమని భావించడం విజ్ఞతతో కూడుకున్న పనికాదు. అలాంటి ప్రతిచర్య మరో ప్రతీకార చర్యకు దారితీస్తుంది. చర్య - ప్రతిచర్య - చర్య ఇదొక విషవలయం. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కొద్దికాలం కోసమైనా గాలింపు చర్యలు, ఎన్‌కౌంటర్లు ఆపడానికి ఎందుకు వెనుకాడుతున్నదో మాకు కారణాలేవీ కనిపించడంలేదు. పీపుల్స్‌వార్ పార్టీ చర్చలకు కాల్పుల విరమణ కోరుతున్నది కనుక మేము పాటించడం సాధ్యంకాదు అనడం సమంజసంగాలేదు. మరొకవైపు ఈ సందర్భంలో చర్చల కోసం పీపుల్స్‌వార్ హింసను ఆపి తమ సంసిద్ధతను ప్రకటించిన సందర్భాలు గతంలో ఉన్నాయి. ప్రపంచంలో ఏ ప్రభుత్వాలు పెట్టని షరతులు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం విధించి చర్చలను పరిహరించడం భావ్యం కాదు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వ్యక్తం చేస్తున్న మరొక ఆందోళన - పీపుల్స్‌వార్ పార్టీ చర్చల కాలాన్ని తమ ఉద్యమాన్ని విస్తరించడానికి ఉపయోగించుకుంటుందని. ఇది నిర్హేతుకమైన ఆందోళన. ఒకవేళ నిజంగానే ప్రజల్లో చర్చల క్రమంలో పీపుల్స్‌వార్ తమ ఉద్యమాన్ని విస్తృతపరచుకుంటే అది ఆ ఉద్యమం యొక్క బలం, ప్రజల్లో దానికున్న ఆమోదం అవుతుందే తప్ప మరొకటి కాదు. అటువంటప్పుడు ప్రజలు ఆమోదిస్తున్న ఒక ఉద్యమాన్ని ప్రభుత్వం అంతం చేయజూస్తున్నది అనే సందేహాలను ప్రజల్లో పురికొల్పడమే కాక, అది ప్రభుత్వం పట్ల మరింత అవిశ్వసనీయతకు దారి తీస్తుంది. శ్రీలంక ప్రభుత్వం కూడ ఈ చర్చల కాలంలో ప్రజల్లో ఎల్.టి.టి.ఇ. ప్రభావం చాలా పెరిగిందని అంగీకరిస్తూనే, ప్రజల ప్రయోజనాల రీత్యా సంప్రదింపులు కొనసాగిస్తూ కొన్ని ఫలితాలను సాధించింది. ఎల్.టి.టి.ఇ. శ్రీలంక ప్రభుత్వం ప్రారంభించిన చర్చలకన్నా ముందు శ్రీలంకలో పరిస్థితులు ఆంధ్రప్రదేశ్‌కన్నా ఎంతో అధ్వాన్నంగా ఉండేవని మీ దృష్టికి మరోసారి తెస్తున్నాము.

ప్రభుత్వం కొద్దికాలం కోసమైనా ఎన్‌కౌంటర్లు ఆపడమనేది ప్రభుత్వ యంత్రాంగం రాజ్యాంగ సూత్రాలకు అనుగుణంగానే నడుచుకుంటోందని ప్రజల్లో ఒక విశ్వాసాన్ని కలిగించడమే అవుతుంది. భారత రాజ్యాంగం పౌరులందరికి జీవించే హక్కును, స్వేచ్ఛను హామీ ఇస్తుంది. ఏ వ్యక్తి ప్రాణానికైనా, స్వేచ్ఛకైనా భంగం కలగదని, చట్టపరిమితులు దాటి ఆయా వ్యక్తుల హక్కులు పరిహరించబడవని రాజ్యాంగం చెప్తుంది. ఎన్‌కౌంటర్‌లుగాని, హత్యలు గాని ఏ చట్టము, ఏ నియమనిబంధనలు ప్రభుత్వానికి ఒక హక్కుగా సమకూర్చలేదని ప్రభుత్వం గ్రహించాలి. అంతే కాకుండా కొద్ది కాలం కోసం ఎన్‌కౌంటర్‌లు ఆపితే ప్రభుత్వం కోల్పోయేదికూడ ఏమీ లేదు. అందువల్ల కొన్ని ప్రాణాలు కాపాడబడతాయి. అవి నక్సలైట్ల ప్రాణాలైనా కావచ్చు. మిలిటెంట్లవైనా కావచ్చు. ఎవరి ప్రాణమైన విలువైనదే. అదే విధంగా పీపుల్స్‌వార్ పార్టీ కొద్ది కాలం పాటు ఆయుధాలు ఉపయోగించడం మానేస్తే అది నష్టపోయేది కూడా ఏమీ లేదు. ఆ చర్య కూడ కొన్ని ప్రాణాలను కాపాడినదే అవుతుంది. ఆ ప్రాణాలు పోలీసులవైనా కావచ్చు. ఇన్‌ఫార్మర్లుగా భావించేవారివైనా కావచ్చు. ఎవరి ప్రాణాలైనా విలువైనవే. పైపెచ్చు ఇందువల్ల ప్రజల్లో పీపుల్స్‌వార్ పట్ల సానుభూతి, సుహృద్భావం పెరుగుతుంది. ఇటీవల పీపుల్స్‌వార్ కిడ్నాప్ చేసి అడవిలోకి తీసుకెళ్ళిన పోలీసులను బేషరతుగా వదిలిపెట్టడం వల్ల అటువంటి సద్భావాన్ని ప్రజల్లో వాళ్ళు పొందారు. అలా

వదిలిపెట్టిన చర్యవల్ల వాళ్ళొక ఆదర్శప్రాయమైన ప్రవర్తనను ప్రదర్శించగలిగారు. ప్రతీకార హత్యలు, అపహరించుకుపోయి చంపడాలు, లెక్కలు చూసుకోవడాలు విప్లవ మార్గంలోకి రావన్న విషయాన్ని కూడ పీపుల్స్‌వార్ పార్టీ గుర్తించాలి.

ఇటీవల ప్రకాశం జిల్లాలో పీపుల్స్‌వార్ పార్టీ అపహరించిన పోలీసులను ప్రజల విజ్ఞప్తి మేరకు మానవతా దృక్పథంతో విడిచి పెట్టిన ఘట్టాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చర్చల ప్రక్రియ పునరుద్ధరణకు ఒక అవకాశంగా భావించి చొరవను ప్రదర్శించాల్సి వుంది. గతంలో అర్థాంతరంగా చర్చలు ఆగిపోయిన తరువాత ఈ సందర్భాన్ని ఒక సదవకాశంగా భావించాలి. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. ప్రజలకు శాంతి భద్రతలు నెలకొల్పే క్రమంలో ఒక సుదీర్ఘ ప్రయత్నంలో ఏ సందర్భము, ఏ అవకాశము వృధా కాకూడదు. నాగాలాండ్, శ్రీలంకలో కూడా ఇరువైపుల అదుపుతప్పి ప్రవర్తించడం జరుగుతూనే వుంది. అయినప్పటికి అక్కడ ఇరువర్గాలు సంయమనంతో చర్చలు కొనసాగిస్తూనే ఉన్నారు. అవసరమనుకున్నప్పుడు దేశం బయట కూడ చర్చలు కొనసాగిస్తున్నారు. గణనీయమైన ఫలితాల్ని కూడ సాధిస్తున్నారు. ఏ కోణం నుండి చూసినా పీపుల్స్‌వార్ పార్టీతో చర్చలు జరపడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఎందుకు చొరవచూపడం లేదో మాకు సహేతుకమైన కారణాలు కనిపించడం లేదు. మేము ప్రభుత్వానికైనా, పీపుల్స్‌వార్‌కైనా ఇంత తరచుగా చర్చలకోసం ఎందుకు విజ్ఞప్తి చేస్తున్నామంటే మీరుభయులు సంభాషణలోకి ప్రవేశిస్తే ప్రజలు ఎదుర్కొంటున్న ఎన్నో సమస్యలకు పరిష్కారాలు లభిస్తాయన్న విశ్వాసంతోనే, నక్సలైట్ ఉద్యమం అణచివేత పేరుతో భారీ స్థాయిలో వినియోగిస్తున్న పోలీసు సిబ్బందిని ఇంకేదైనా నిర్మాణాత్మక ప్రయోజనానికి ఉపయోగించుకోవచ్చు. పోలీసు సిబ్బంది మీద ఖర్చు పెడుతున్న భారీ బడ్జెట్‌ను, నక్సలైట్ వ్యతిరేక కార్యకలాపాలలో ఖర్చు పెడుతున్న జవాబుదారీలేని డబ్బును ఇంకేదైనా సంక్షేమ కార్యక్రమాలకు సద్వినియోగం చేయవచ్చు. పోలీసులకు పంచుతున్న బహుమతి ధనాన్ని ఆదాచేసుకోవచ్చు. ప్రాణాలు కాపాడబడడమే కాకుండా ప్రజల ఆస్తులు కూడ కాపాడవచ్చు. అలాగే పీపుల్స్‌వార్ కూడ తన శక్తినంతా ప్రజాప్రయోజనాలను ఇంకా ముందుకు తీసుకుపోవడానికి, ప్రజా చైతన్యాన్ని విస్తృత స్థాయిలో వికసింపచేయడానికి ఉపయోగించవచ్చు. మనముందు నిజానికి ఇంతకన్నా తీవ్రమైన, మౌలికమైన సమస్యలున్నాయి. కరువు, త్రాగునీరు - సాగునీరు కొరత, నిరుద్యోగం, భూపంపకాలు వంటి సమస్యలు ఎన్నో.

ఈ దృష్టితో చూసినప్పుడు ప్రభుత్వం పీపుల్స్‌వార్‌ను ప్రధాన స్రవంతిలో చేరాల్సిందిగా ఇస్తున్న పిలుపు కూడ ఆచరణరూపం ధరించక ఎంత అర్థరహితంగా మిగిలిపోతోందో అర్థం చేసుకోవచ్చు. ప్రభుత్వం వైపు నుండి వస్తున్న అటువంటి ఆహ్వానం అభిలషణీయమే గాని అంతకన్నా ముందు ప్రభుత్వం నక్సలైట్ ఉద్యమం ఏ సమస్యల పరిష్కారాన్ని కోరుతూ ప్రారంభమైందో అటువైపుగా తన దృష్టిని సారించాలి. నక్సలైట్ ఉద్యమం ప్రధాన లక్ష్యాలు - భూమి పంపకం, దారిద్ర్య నిర్మూలన, ఉపాధికల్పన. ప్రభుత్వం భూపంపకాల విషయంలో మరింత కట్టుదిట్టమైన చర్యలు తీసుకొని దానితోపాటు ఇతర సమస్యల పరిష్కారానికి తమతో సహకరించవలసిందిగా నక్సలైట్ల ఉద్యమ కార్యకర్తలను ఆహ్వానించి వుంటే అప్పుడు దాన్ని అనుకూలంగా అర్థం చేసుకోవడం సాధ్యమౌతుంది. భూపంపకాలకోసం ఆచరణలో పటిష్ఠమైన పథకాలేవీ రూపొందించకుండానే నక్సలైట్ ఉద్యమ కార్యకర్తలను ప్రధాన స్రవంతిలో చేరాల్సిందిగా కోరడం ప్రజలను మభ్యపెట్టే చర్యగా మాత్రమే భావించాల్సి వస్తుంది. ప్రజలు కూడ దాన్ని కేవలం ఒక ఎత్తుగడగా మాత్రమే గుర్తిస్తారు. ఇంతకన్నా హాస్యాస్పదమైన విషయం - లొంగిపోయిన నక్సలైట్లకు ప్రభుత్వం లక్షలాది రూపాయల ఆర్థిక సహాయాన్ని సమకూర్చడం. వాస్తవానికి ప్రభుత్వ యంత్రాంగానికి ఇది ఆరోగ్యకరమైన లక్షణం కాదు. ఎందుకంటే అపారమైన ప్రజాధనం దుర్వినియోగం అవడమే కాకుండా, నక్సలైట్ ఉద్యమం ప్రారంభమైంది కేవలం అందులో పాల్గొంటున్న వారి స్వయం ఉపాధి కొరకు మాత్రమే కాదు. నక్సలైట్ ఉద్యమానికి విస్తృతమైన సామాజిక లక్ష్యం ఉంది. ప్రభుత్వం అనేకమార్లు ఒప్పుకున్నట్లే ఆ ఉద్యమం సామాజిక, ఆర్థిక, రాజకీయ ఉద్యమం కూడ. నక్సలైట్ ఉద్యమకారులను ప్రధాన స్రవంతిలో చేరమని పిలవడానికన్నా ముందు ప్రభుత్వం ఆ విస్తృతమైన లక్ష్యంవైపు దృష్టిని సారించాలి. ఇందుకోసం ముందుగా ప్రభుత్వం నక్సలైట్ నాయకులను చర్చలకు పిలిస్తే ప్రభుత్వ ఉద్దేశ్యంలో చిత్తశుద్ధి ఉందని ప్రజలు భావిస్తారు. ఇవాళ ఆంధ్రప్రదేశ్‌లో పరిస్థితి ఏమిటంటే, ఒకవేళ మీ పిలుపును మన్నించి ఎవరైనా బయటకొచ్చినా, నిజాయితీగల క్రియాశీల కార్యకర్తగా ప్రజల సమస్యల పరిష్కారానికి ప్రజాస్వామిక పద్ధతిలో కూడ కార్యకలాపాలు సాగించలేని స్థితి నెలకొని ఉంది. పోలీసులు చిన్నపాటి నిరసనను కూడ సహించే, అనుమతించే స్థితిలో లేరు.

***(మిగతాది 22వ పేజీలో)***

# వ్యవసాయ రంగంలో ద్రవ్య పెట్టుబడి, రుణ విధాన అంశాలు - ఓ పరిశీలన

- బి. ఎర్రంరాజు

**1950 వ దశకంలో** స్థూల జాతీయాదాయంలో సింహభాగాన్ని అందించిన వ్యవసాయ రంగం, 1990 నాటికల్లా పావువాటా జాతీయాదాయానికే పరిమితం అయింది. అయినా జాతీయ ఆర్థిక ప్రధాన వనరుగా, అశేష ప్రజానీకానికి ఆహార భద్రతా కేంద్రంగా నేటికీ సంతరించుకుంది. దేశ జనాభాలో సుమారు 70 శాతం గ్రామీణ ప్రజానీకానికి జీవన వనరుగా, అభివృద్ధి సమతుల్యత నందిస్తూ వలసలను నివారించేదిగా వ్యవసాయరంగం నిలుస్తుంది.

1951లో 50 మిలియన్ టన్నుల ఉత్పత్తి స్థాయి నుండి, ఏభై ఏళ్ళ కాలంలో 210 మిలియన్ టన్నుల ఉత్పత్తి స్థాయికి పెరిగినప్పటికీ సమగ్ర వ్యవసాయాభివృద్ధి జరుగలేదు. 1980 దశకంలో 3.5 శాతం వున్న అభివృద్ధి 1990 దశకం నాటికి 2.6 శాతానికి దిగజారింది. దేశ వ్యాప్తంగా కొనసాగింపుగా తలెత్తుతున్న కరవు, తరచు ఎదురయ్యే తుఫాన్లు వరదలు ప్రధాన ఆటంకాలవుతున్నాయి. అన్నదాతల ఆత్మహత్యల వెల్లువే ఈ రంగంలో ఎదురౌతున్న సంక్షోభ సంకేతాలుగా నిలుస్తాయి. ఎనిమిది శాతం మేరకు ఆర్థికాభివృద్ధి సాధించాలంటే వ్యవసాయ రంగంలో 4.5 శాతం అభివృద్ధిని సాధించిన నాడే సాధ్యం కాగలదు. నేటి పరిస్థితుల్లో ఈ మేర అభివృద్ధి నాశించడం అత్యాశ కాగలదు.

ఆర్థిక సంస్కరణలు పారిశ్రామిక రంగానికిస్తున్న ప్రాముఖ్యతను వ్యవసాయ రంగానికీయడం లేదు. స్వదేశీ వ్యాపారంలో నిబంధనలు సడలించడమో, ప్రధాన ఉత్పాదకాల నిల్వలపై ఆంక్షలు తొలగించడమో చేస్తే కాదు. ప్రపంచ వాణిజ్య సంస్థ ఒప్పందాల మేరకు జాతీయ వ్యవసాయ విధానాన్ని సవరించుకున్నా ప్రయోజనం శూన్యం. నేటి వ్యవసాయాభివృద్ధికై సంస్థానుగత రుణ విధాన మెరుగుదల అంశాలను పరిశీలిద్దాం. వ్యవసాయ రుణ విధాన సానుకూల పరిశీలన సమస్య పరిష్కారానికి దోహద పడగలదని ఆశిద్దాం.

ప్రపంచ దేశాల్లో భారతదేశం ఓ వ్యవసాయాధారిత దేశం. 1960 లో చోటు చేసుకున్న సాంకేతికాభివృద్ధి ఒక్క వ్యవసాయ రంగంలోనే కాకుండా సంబంధిత రంగాల్లోనూ అభివృద్ధిని సాధించింది. ఈ అభివృద్ధిలో ప్రాంతీయ వాతావరణ పరిస్థితుల్లో బేధాల కనుగుణంగా అభివృద్ధిలోనూ మార్పు చోటు చేసుకుంది. అంతేకాకుండా వ్యవసాయం రాజ్యాంగ రీత్యా రాష్ట్ర ప్రభుత్వ ఖాతాలో వున్నందున, విధాన రూపకల్పన, అమలు తీరుల్లో చోటు చేసుకున్న తేడాలు ఆచరణలోనూ కన్పించాయి. రుణ సౌకర్య అమలు వంటి విధానాల్లో సైతం ఈ తేడాలు వ్యవసాయాభివృద్ధిలో పొడచూప సాగాయి.

భారత దేశ వ్యవసాయ రంగంలో సుమారు 78 శాతం చిన్న సన్నకారు రైతాంగమే. వీరిలో 59 శాతం సన్నకారు రైతాంగమే. అంటే ఒక హెక్టారుకు లోపు భూ కమతాలు కలవారు. మరో 19 శాతం ఒకటి నుండి రెండు హెక్టార్ల లోపు భూములున్నవారు. మొత్తం సేద్య విస్తీర్ణంలో వీరు మూడో వంతుకు లోపునే వున్నవారు. పది హెక్టార్లకు పైబడి విస్తీర్ణ కమతాలను సేద్యం చేసే రైతాంగ శాతం 1.6 శాతం. వ్యవసాయ రంగాభివృద్ధికై ఏ విధానాన్ని చేపట్టినా, అత్యధిక లబ్ధిదారులను దృష్టిలో పెట్టుకుని రూపొందించాల్సి వుంటుంది. రుణ సౌకర్య లబ్ధికి భూయాజమాన్యం కీలకమైనందున కౌలుదార్లకు రక్షణ కరువయింది.

మన సేద్యం కేవలం రుతుపవనాల పైనే ఆధారపడి వున్నందున సేద్యపు వంటల ఎంపిక, ఉత్పత్తి అంతా దైవాదీనంగానే మారుతుంది. 90వ దశకం నుండి గ్యారంటీ లేని ఆహారోత్పత్తి పంటల సేద్యం నుండి వాణిజ్య పంటలకు మారుతూ వస్తుంది. మెట్ట భూముల సేద్యం మూడింట రెండొంతులకు కుదించబడింది. సాగునీటి వనరుల అభివృద్ధి కుంటుపడి 40 శాతం సేద్య భూములు పడావు పడసాగాయి. మొత్తం సేద్యంలో 38 శాతం మేరకే సాగునీటి వసతి

లభ్యమౌతుంది. కాలువలు, చెరువులు వంటి సేద్యపు వనరుల స్థానంలో బావులు చోటుచేసుకుంటున్నాయి.

హరిత విప్లవానికి ముందు 46.9 శాతం భూముల్లో సేద్యం చేపడితే 43.1 శాతం ఉత్పత్తి దిగుబడి వచ్చేది. తదనంతరం సేద్యపు విస్తీర్ణం 10.6 శాతానికి కుదించుకుపోగా ఉత్పత్తి దిగుబడి 78.6 శాతానికి పెరిగింది. వ్యవసాయోత్పత్తుల తయారీ సరుకుల ధరల సూచీ 1993-94లో 103.3 శాతం నుండి 2000-01 నాటికి 115.5 శాతానికి పెరిగి పోయాయి.

వ్యవసాయరంగంపై ఆధారపడ్డ వారినే తీసుకుంటే 1971 నాటికి 67.6 శాతం మందిగా వుంటే 1991 నాటికి 64.9 శాతం అయ్యారు. అదే వ్యవసాయ కార్మికులనే పరిగణన లోకి తీసుకుంటే 122 మిలియన్ల నుండి 189 మిలియన్లకు పెరిగారు. గ్రామీణ పట్టణ ప్రాంతాల్లో ఉపాధికల్పన కొరవడినందున చోటుచేసుకున్న పరిణామం యిది. వ్యవసాయ రంగంలో అత్యధిక అభివృద్ధిని సాధించిన రాష్ట్రాలే పేదరిక నిర్మూలనతో సైతం అగ్రభాగాన నిలువగలుగుతాయి. గ్రామీణ ప్రాంతాల్లో సేద్యం పరిమితమై పోతున్నందున ఉపాధి కరువై వలసలకు నెలవవుతున్న వైనం. ఆధునిక సేద్యం శక్తికి మించిన భారమై, ఉత్పత్తులకు గిట్టుబాటు ధరలు సైతం లభ్యం కాని పరిస్థితులున్నాయ్. అసమగ్ర రుణ సదుపాయం, నాణ్యత లేని దిగుబడులు, ఆటంకాలు లేని దిగుమతులు, వ్యవసాయ రంగంలో పాలకులకు గల నిర్లక్ష్యానికి అద్దం పడుతున్నాయి.

ద్రవ్య పెట్టుబడి నవీకరణ మనదేశ వ్యవసాయరంగంలో ప్రభుత్వ, ప్రైవేటు, కార్పొరేటు శక్తులచే తరతమ స్థాయిల్లో నిర్వహించబడుతోంది. 80వ దశకం మధ్యనుండి ప్రభుత్వ పెట్టుబడులు తగ్గుతూ వచ్చాయి. 80వ దశకంలో 38.9 శాతంగా వున్న ప్రభుత్వ ప్రమేయం 1990-91 నాటికి 26 శాతానికి తగ్గిపోగా, అది 1995-96నాటికి 18.4 శాతానికి కుదించబడింది. సంస్కరణల అమలు ప్రవేశం నాటినుండే ఈ ప్రభుత్వ ప్రమేయం కుదించుకు పోవడం గమనార్హం! ఇందుకుతోడు అస్థిర దిగుబడి, తీవ్రతర పోటీ, మౌలిక వనరుల కొరత, తగ్గుతున్న ప్రభుత్వ ప్రమేయం, తగ్గుతున్న రాయితీలు, ధరల అనిశ్చిత, పర్యావరణ సమతుల్యతలతో వ్యవసాయరంగం కొట్టుమిట్టాడుతుంది. యిందుకుగాను భవిష్యత్ వ్యవసాయం సమర్ధవంత దిగుబడులు, అనల్ప సాంకేతికత, ఉత్పత్తి పెంపకం, ధరవరల సూచికల కనుగుణంగా సేద్యపు మార్పిడి, తదితర అంశాల లక్ష్యంగా నూతన వ్యవసాయ విధానాలను రూపొందించుకోవాల్సి వుంది.

***(మిగతాది వచ్చే సంచికలో)***

***(20వ పేజీ తరువాయి)***

ప్రపంచంలో ఎక్కడైనా, ఎటువంటి సందర్భంలోనైనా సమస్యల పరిష్కారానికి చర్చల ప్రక్రియను ప్రారంభించడానికి ప్రభుత్వమే ముందు చొరవను ప్రదర్శించాలని, ప్రదర్శిస్తోందని మేము భావిస్తున్నాము. చాలా ఉద్రిక్త పరిస్థితులలో కూడ చర్చలను ప్రారంభించడమనేది ప్రభుత్వానికి సాధ్యమౌతుంది. ఎందుకంటే ప్రభుత్వం ఎప్పుడూ ఒక సదుపాయం కలిగిన స్థితిలో ఉంటుంది. భారత ప్రభుత్వం పాకిస్తాన్‌తో చర్చలకు ఆహ్వానాన్ని అందిస్తున్నప్పుడు శ్రీలంక ప్రభుత్వం ఎల్.టి.టి.ఇ.తో చర్చలు ప్రారంభించగలిగినప్పుడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పీపుల్స్‌వార్ పార్టీతో చర్చలకు ఎందుకు ముందుకు రావడంలేదో మాకర్థం కావడం లేదు. నక్సలైట్ ఉద్యమంలో పాలుపంచుకుంటున్న సభ్యులందరూ ఈ దేశ పౌరులే. ఈ రాష్ట్రంలో శాశ్వతంగా నివాసముంటున్నవారే. ఒక నిర్దిష్టకాలానికి నిషేధింపబడినప్పటికి వాళ్లొక సంస్థలో సభ్యులు. ఆ నిషేధం తొలిగించబడితే వాళ్ళు రాష్ట్రంలో ఉన్న అన్ని సంస్థల వంటి ఒక సంస్థలో సభ్యులు పొందే అన్ని హక్కులు పొందుతారు. అటువంటి వారిపట్ల ప్రభుత్వం కేవలం అణచివేత ధోరణిని అవలంబించాల్సిన అవసరం లేదు.

అందువలన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి మేము గౌరవనీయులైన ముఖ్యమంత్రి ద్వారా మరియు సిపిఐ (యంఎల్) పీపుల్స్‌వార్ పార్టీకి దాని కార్యదర్శి ద్వారా విస్తృత ప్రజాప్రయోజనాల దృష్ట్యా వెంటనే చర్చలు ప్రారంభించాల్సిందిగా హృదయపూర్వకంగా ఈ బహిరంగ విజ్ఞప్తి చేస్తున్నాము. అలాంటి విజ్ఞప్తికి పీపుల్స్‌వార్ పార్టీ కూడ అణుగుణంగా స్పందించవలసిందిగా కూడ విజ్ఞప్తి చేస్తున్నాము. చర్చల ఎజెండా, విధి విధానాలు లాంటి అన్ని అంశాలు పరస్పరం చర్చించుకొని రూపొందించుకోవచ్చు. చర్చలు ప్రారంభించడానికి మళ్ళీ మరో హింసాపూరితమైన ఎన్‌కౌంటర్లు, కిడ్నాపుల ప్రహసనం దాకా కాలయాపన చేయవద్దని ఉభయులకు మేము విజ్ఞప్తి చేస్తున్నాము. ఈ మాట కేవలం ఎన్‌కౌంటర్లు, కిడ్నాపులను మాత్రమే దృష్టిలో ఉంచుకొని అంటున్నవిగా భావించకుండా ప్రజల విస్తృత ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని చేస్తున్నదిగా భావించి ఇరువర్గాలు శాంతి చర్చల ప్రక్రియను వెంటనే ప్రారంభించాల్సిందిగా మరోసారి విజ్ఞప్తి చేస్తున్నాము. ❐

# బండారు ప్రకటనలోని 'బండారం'

- కవిత

**సమాజంలో పేదరిక** నిర్మూలనకు కేంద్ర ప్రభుత్వం పలు పథకాలను అమలుపరుస్తుందని కేంద్ర రైల్వే సహాయ మంత్రి బండారు దత్తాత్రేయ చెప్పడంలో ఆశ్చర్యం లేదు. ఆ ప్రభుత్వం తానులో ఈయన ఒక ముక్క. కాని ఆ పథకాలు ఎలా అమలు జరుగుతున్నాయనే విషయం ఎటువంటి ఫలితాలనిచ్చాయి అనే విషయం ఆయన చెప్పక పోవడంలోనూ ఆశ్చర్యపడాల్సిన పనిలేదు. ఎందుచేతనంటే అవి అనుకున్నట్లు అమలు కాకపోవడమే కాదు; బడ్జెట్‌లో చేసిన కేటాయింపులు కరి మింగిన వెలగపండులా తయారయ్యాయి.

మొన్న మొన్ననే కేంద్ర పట్టణ-గ్రామీణ మంత్రిత్వ శాఖ స్టాండింగ్ కమిటీ నివేదిక లోక్‌సభలో ప్రవేశపెట్టగా, దానిని చదవబోతే బండారు దత్తాత్రేయ బండారం బయట పడింది. ఈ శాఖకు తొమ్మిదవ ప్రణాళికలో చేసిన కేటాయింపులో 30 శాతం నిధులు ఖర్చేకాలేదు. అసలు బడ్జెట్‌లో చేసిన కేటాయింపులో సవరించిన అంచనా స్టేజ్‌లోనే కేటాయింపుకు పెద్ద కోత విధించింది. ఆ కోత తరువాత మిగిలిన కేటాయింపును కూడా కేంద్రం ఖర్చు చేయలేదు. ఇది 9వ ప్రణాళికా కాలంలో చేసిన నిర్వాకం అయితే, 2001-02లో 20 శాతం నిధులను మాత్రమే ఖర్చు చేసిందని కమిటీ గమనించింది. పేదలకు గృహ నిర్మాణం పద్దు క్రింద 30 శాతం నిధులు మాత్రమే ఖర్చు అయ్యాయి. పట్టణాల్లో కాలి బాటల మీద జీవితం గడిపే అనాధులకు ఆశ్రయం కల్పించే పథకానికి చేసిన కేటాయింపు నయాపైసా కూడా ఖర్చు చేయలేదు. కమిటీ చేసిన ఈ విమర్శల నుంచి ప్రభుత్వాన్ని ఎలా రక్షించాలో తమను తామే ఎలా రక్షించుకోవాలో ప్రొక్రసీకి వెన్నతో పెట్టిన విద్య. ఈ విద్యలో వారికి పరీక్ష పెడితే నూటికి 125 మార్కులు కూడా వస్తాయి. కమిటీ చేసిన వ్యాఖ్యలు ఆ సంవత్సరంలో ఫిబ్రవరి ఆఖరి వరకు చేసిన ఖర్చు లెక్కల ఆధారంగా చేసినవని, మార్చి నెలలో చేసిన ఖర్చుతో కలిపి చూస్తే 98 శాతం డబ్బు ఖర్చు చేసామని ఒక లెక్కల గారడీ చేశారు. ఖర్చు కాకపోవడానికి కారణం రాష్ట్ర ప్రభుత్వాలని మరో వివరణ ఇచ్చారు. కమిటీ ఈ వివరణను అంగీకరించలేదు. స్వర్ణజయంతి షహరి రోజ్‌గార్ యోజన పథకానికి 2001-02లో 168 కోట్లు, బడ్జెట్‌లో కేటాయించి సవరించిన అంచనా నాటికి 45.50 కోట్లకు తగ్గించి, ఫిబ్రవరి 2002 నాటికి కేవలం 10 కోట్లు మాత్రమే ఖర్చు చేసింది. ఆ తరువాత ఒక్క మార్చి నెలలోనే రు.18.5 కోట్లు ఖర్చు చేయడాన్ని కమిటీ జీర్ణించుకోలేక పోయింది. అంటే బడ్జెట్‌లో కేటాయింపు రు.168 కోట్లు, వాస్తవంలో ఖర్చు రు.39 కోట్లు మాత్రమే.

దత్తన్నా, వింటున్నారా? "పట్టణ పేదలకు ఉద్దేశించిన కేంద్ర ప్రతిపాదిత పథకాలను అమలు చేయడంలో ఈ శాఖ శ్రద్ధ చూపలేదు" అని కమిటీ అభిప్రాయాన్ని వ్యక్తం చేసింది. ఆఖరు నెలలో ఇంత పెద్ద ఎత్తున ఖర్చు చేయడం అనేక అవకతవకలకు దారి తీస్తుందని పార్లమెంట్ స్టాండింగ్ కమిటీ హెచ్చరించింది. □

# Low

# Lower

## Andhra Bank's credit cards have the




# Lowest

## service charge - just 1.75%

without finance charge

Our Credit Cards do excel. A World of exciting benifits:

- ATM Compatibility
- Roll over facility
- Interest free credit of 21-50 days
- No additional finance charges
- Add on card facility
- Global Acceptance of Gold Card
- Accident insurance coverage between Rs. 2 & 5 Lakh
- Cash facility up to 1/3rd of the card limit

So, is it any wonder that our cards in such demand? Contact our nearest branch for further details.

ఆంధ్రాబ్యాంక్ आन्ध्रा बैंक Andhra Bank

(A Govt. of India Undertaking)

Visit us at : www.andhrabank-india.com

Email :ccdhelpdesk@andhrabank.co.in / ccdhyd@ab.sify.net

**First in Service - Best in Banking**